౦౬౦

౦౧౦

శ్రీగురుభ్యోనమః

# సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని

## రా జ యో గీ య ము



అచలఋషి

దయానంద పొన్నాల రాజయోగి

విరచితము



౦ఓ౦

౦౧౦

శ్రీగురుభ్యోనమః

# సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని

## రా జ యో గీ య ము



అచలఋషి

దయానంద పౌన్నాల రాజయోగి

విరచితము



# విషయ సూచిక

శ్రీ ఫిల్హాన లక్ష్మణ దేశికప్రభు ప్రియశిష్యులు



అ॥ ప॥ మడిపడిగ కృష్ణమాచారి, ధర్మపత్ని మాణిక్యాంబగారు,

# తొలిపలుకు

కం॥ సూరిజనులె యీగ్రంధపు సారముగను వారుగాని సంసార మహా
ఘోర వారాశిజేరిన వారలు వినిదీన్ని జూచి వచియింపుదురే ॥

సూరి జనులు అనగా కైవల్యశరీర పద్ధతియందు పురుషోత్తముడుగా ప్రవర్తించేవారు. ఈ సూరి జనులనే, శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రులవారు. తమ కందార్ధకంద పద్యముల గ్రంధములో, స్వచ్ఛందులు, యితర జేజేలు, అశరీరులు, సుజనులు, అనే పదములతో సూచిస్తూ వచ్చినారు

ఘోరసంసార వారాశి చేరినవారలనగా - జననమరణ ప్రవాహమునందు శాశ్వతముగ కొట్టుకొనిపోవుచూ దరిగాన లేక పోవువారు అని అర్ధము. ఏ సాధనము చేయక, యింద్రియవిషయములకు లోలత్వముచెంది, అవస్థాత్రయము లందు సంచరిస్తూ తుదకు మరణించువారు మానవ పశువులనబడుదురు. వీరిక్రి జన్మరాహిత్యము కలలోని వార్త, వీరేగాక జన్మరాహిత్య రూపమోక్షమాసించి, వ్యర్ధసాధనలు చేయువారున్ను జన్మరాహిత్యమనునది పొందలేరు. ఏలననగా, జన్మకారణమగు వస్తువు వీరుచేయు సాధనలలో నశించక అట్లే నిలచియుండును ఆ జన్మ కారణవస్తువు నశించనిచో పునఃపునః జన్మలనెత్తించుచునే యుండును. కనుక యమనియమ ఆసనాదులచే అణిమాది అష్టసిద్ధులను పొందవలెనని ప్రయత్నించువారు గాని, జ్ఞానభూమికల యందు కృషిచేయువారుగాని, మంత్ర, లయ, హఠ, రాజయోగములను యోగసాధనలు చేయువారుగాని, తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్య, వార్తికాది పద్ధతులయందు కృషిచేయువారు గాని, జన్మరాహిత్య రూపమోక్షమును చెందజాలరు. ఈ పద్ధతులయందు జన్మ కారణమగు వస్తువు నశించక శేషించియే యుంటున్నది. కనుక పైన పేర్కొన బడిన సాధకులందరుఘోరసంసార వారాశిలోనున్నవారే అని చెప్పవలెను.

ఐతే, అన్నిసాధనలకున్ను, అత్యంత పరమపురుషార్ధమైన (జన్మ రాహిత్యమే) ఫలప్రాప్తిగా చెప్పుచూ వుంటారు. కారణమేమనగా, సాధనలవల్ల, సాధనాంతర నిరపేక్షకమగు పరిపూర్ణము సిద్ధించబోదని యెప్పటికైన వారు గ్రహింప గలుగుదురేమో, ఎప్పటికైనవారు నిజమైన మార్గమునకు రాగలుగుదు రేమో యని ప్రతి సాధనకున్ను జన్మరాహిత్యమే ఫలప్రాప్తిగా చెప్పబడినది. కాని పూర్వపుణ్యవిశేషమున్న వారికిగాని యీ పరిపూర్ణబోధ ప్రాప్తించనేరదు.

కనుక యీ సాధకులు గమ్యస్థానము చేరలేరు. వారి కెప్పటికీ సాధనాపేక్ష పోజాలదు చర్వితచర్వణముగా పుట్టిచచ్చుచనే వుందురు. విషమూలికల చూర్ణముతో ఒక ద్రావకమును తయారుచేసి సీసాలో బిగించి, అమృతరసాయన మని దాని కొక అందమైన లేబెల్ (చీటీ) అంటించినచో అది అమృతమగునా ? అధిష్ఠాన చేతన బ్రహ్మమగు అఖండ యెరుకయే పరమగమ్యమని మరి కొందరు మోసపోవుచున్నారు. తత్ప్రాప్తి కొరకే కష్టించుచున్నారు. అంతటితో జన్మ రాహిత్యమౌనని ఆశపడుచున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు అన్వయము చేసుకోవలసిన శ్రుతిస్మృతుల వాక్యములను, అధిష్ఠాన చేతన బ్రహ్మమునకే సరిపడునట్లు వ్యాఖ్యానించుకొని తృప్తిపడుచున్నారు. కేవల శాస్త్రవాక్యములచే తమ తమ మతనిర్ణయములను సమర్ధింప జూచుకొనుచున్నారేగాని గురుముఖతః ఆయాశాస్త్రవాక్యములకుగల నిజాభిప్రాయమును గుర్తించుటలేదు. గురునిచేరి అనుభవముతో గూడిన వారి ప్రబోధను పొందుటకు వారి అహంకారము అడ్డు తగులుటచే, గురుకీలకము వారికెప్పటికిని అందరానిదిగానే నిలచిపోవుచున్నది. గురుని ప్రబోధచే మాత్రమే వస్తువు యొక్క స్థానస్వరూప స్వభావములు తెలియబడగలవు. వస్తునిర్ణయము పొందక శాస్త్రవాక్యాలపై నాధారపడినచో, గవయ మృగమును జూచి గోవుగాను వానరుని జూచి నరునిగానూ నిర్ణయించు కొన్నట్లే యగును.

వాక్యార్థము కూడా గురుముఖతః తెలియవలసి వున్నపుడు గురువు చెప్పిన అర్థమే సరియైనదని యెట్లు చెప్పనగును ? గురువు చెప్పిన అర్థము వస్తువునందు పర్యవసించుచున్నదా లేదా యని చూచుకొన వచ్చును. ఆ వస్తువుకూడా గురువే చూపవలయును గాని యితరులు చూపించ జాలరు. "శాస్త్రదృష్టం, గురు ర్వాక్యం. తృతీయం ఆత్మనిశ్చయం, చతుర్థం సంశయచ్ఛేదం, పంచమం ముక్తిదాయకం" అనునది యెంతయు పరమ సత్యము. శాస్త్రమునకు గురువు చెప్పి చూపించిన వస్తువునకు సరిపోయినపుడే ఆరూఢమై సర్వసంశయములు రహితమై మోక్షము కరతలామలకము కాగలదు.

కనుక జన్మరాహిత్య రూపశాశ్వతమోక్షమును కోరు జిజ్ఞాసువులగు స్త్రీ పురుషులు యీ గ్రంధము నామూలాగ్రము చదివి విచారించి గురుపాదము లాశ్రయించి కృతార్థులగుదురు గాక !

సికింద్రాబాద్
15-8-75

ఇట్లు
గ్రంధకర్త.

# శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠాధిపతులు

## అ చ ల ర్షి



దయానంద పొన్నాల రాజయోగి

శ్రీ గురుభ్యోనమః

# సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని

## రా జ యో గీ య ము

## పరిపూర్ణబోధ - గురునిర్ణయము

(1) బోధక గురువు, (2) వేదక గురువు. (3) నిషిద్ధగురువు, (4) కామ్యక గురువు, (5) సూచక గురువు, (6) వాచక గురువు, (7) కారణ గురువు, (8) విహిత గురువు అని గురువులు అష్టవిధములుగ చెప్పబడినారు

1. శాస్త్రశబ్ద శబ్దార్థములు బోధించువాడు బోధక గురువు
2 తత్వమును దర్శింపచేయువాడు వేదక గురువు
3. వశ్యాకర్షణాద్యష్ట కర్మలచేత, యిహపరలోకములయందు మోద ఖేదముల నిచ్చువాడు నిషిద్ధ గురువు.
4. పుణ్యకర్మోపదేశముచేసి యిహపరసుఖముల నిచ్చువాడు కామ్యక గురువు.
5. వివేక గుణముచేత శమదమాది సద్గుణములు గలుగచేయువాడు సూచక గురువు
6. విషయములందు వైరాగ్యము గల్గించిన ఆత్మానురాగప్రదుడు వాచక గురువు
7 జీవశివైక్యజ్ఞానము గలుగచేసినవాడు కారణ గురువు
8. మహావాక్య. వార్తిక, నిర్ణయానుసారము, నిత్యముక్తిని ఘటింప చేయువాడు విహితగురువు. అనబడుదురు

ఈ అష్టవిధగురువులలో యే గురువున్నూ పరిపూర్ణ బోధ దెల్పుటకు అధికారి కాడు. ఏలననగా శక్తి ద్వయ నిరాసకమగు శుద్ధ నిర్గుణతత్వమును, క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత పరమ తత్వమును ప్రబోధించునది, పరిపూర్ణ బోధ గనుక, క్షరాక్షర పురుషుల స్పర్శయెరుగక, పురుషోత్తమ పద్ధతియగు

కైవల్యశరీర నిర్ణయమునందు ప్రవర్తించే సూరి జనులగు స్వచ్ఛందులు పరిపూర్ణ బోధ ప్రబోధించ గలరు యితర పద్ధతులు గలవారు పరిపూర్ణబోధ బోధించుటకు, అధికారులుగారు కనుక.

కం॥ జిహ్వోపస్థ విషయము లెవ్విగలవొ, వాటి విడువ
లేని గురువులన్ యెవ్వరు జేరి కొలతురొ యివ్వసుధను వారు
జెడుదు రిదినిజము సుమీ॥

కం॥ అనుభవవేదాంతులమని, తినరాని పదార్థమెల్ల
తిను దుర్జనులన్, కనబోకుము, తద్బోధను విన
బోకుము యెన్నటికి వివేక విచారా॥

అని శ్రీభాగవతుల కృష్ణదేశికుల నిర్ణయము.

## 2. పరిపూర్ణ బోధకు శిష్యనిర్ణయము

*అధికారి లక్షణము:—జ్ఞానపద్ధతి.*

జ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞాన పద్ధతులచేత బ్రహ్మత్వము పొందగలమని, నిశ్చయముచేసుకొన్నవారు, సాధన చతుష్టయము గలవారు అధికారులని నిర్ణయించిరేగాని పరిపూర్ణబోధ తెలియుటకు యిది అధికారి లక్షణముకాదు.

వైరాగ్య పద్ధతి;—జ్ఞానభూమికలు అనగా

1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసి. 4. సత్వాపత్తి, 5. అసంసక్తి, 6. పదార్థభావన, 7. తురీయము అనునవి.

ఇందు శుభేచ్ఛయనగా, పూర్వ పూర్వజన్మల సుకృత పరిపాకము వలన జ్ఞానముగలవాడై, "యీ సంసారసాగరమునమ్మి నేను మూఢుడనైతిన"ని పరితపించుచు, బ్రహ్మవిదులచేరి వారి వుపదేశముల ననుసరించి, వైరాగ్య పద్ధతివనుసరించు వారు పరిపూర్ణబోధ వినుటకు అధికారులు కారు.

*భక్తిపద్ధతి:—*

ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అని భక్తిపరులు 4 విధములుగానున్నారు ఇందు.

జ్ఞానభక్తి మూడు విధములు

1. బాహ్యభక్తి, 2. అనన్యభక్తి, 3. ఏకాంత భక్తి, ఇందు బాహ్య భక్తి నవవిధములుగ చెప్పబడినది యిందు యే భక్తి పద్ధతియందున్న వారైనను, పరిపూర్ణబోధ వినుటకు అధికారులు కారు.

## నైమిత్తిక కర్మాచరణ పద్ధతి

సూర్య, చంద్ర, గ్రహణసమయములందును, పూర్ణిమ, అమావాస్యల యందును, మహాశివరాత్రి, వైకుంఠఏకాదశి, పుష్కరములు మొదలగు పర్వ దినములయందును, గంగ, గోదావరి, నర్మద మొదలగు నదీస్నానము లాచరించి, పుణ్యవంతుల మైనామని ఆనందించువారు పరిపూర్ణబోధ వినుటకు అధికారులుకారు.

## మంత్రపద్ధతుల నిర్ణయము

సుదర్శనచక్రము, శరభసాళ్వము, రాజరాజేశ్వరి, బాల, త్రిపురసుందరి, వారాహి, మొదలగు మంత్రోపాసనల యందిచ్ఛగలవారు, అష్టే, త్రిపాదచతుష్పాద గాయత్రి, హంసమంత్రము, చతురాక్షరి, పంచాక్షరి, అష్టాక్షరి, మొదలగు మంత్ర సిద్ధిపొంద గోరువారును పరిపూర్ణబోధకు శ్రవణాధికారులుగారు.

## యజ్ఞయాగాదుల నిర్ణయము

యజ్ఞయాగాది క్రతువులయందు భ్రాంతిగలవారు, పరిపూర్ణబోధ శ్రవణాధి కారులుగారు.

ఐనను పైనుదహరించిన, జ్ఞానవైరాగ్య కర్మాదులయందు కృషిచేయువారు, పూర్ణగురు సార్వభౌముని శరణుజొచ్చి సేవించినచో, వారివారి ఆశయములకు తగినట్లు ప్రబోధించి, అఖండయెరుక పద్ధతి వారికి తెలియజేసి, పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శింపజేసి వారిభ్రాంతిని సమూలముగా రహితపరచి వారిని జన్మకర్మల భ్రాంతినుండి విడిపించగలరు. పరిపూర్ణగురువులే యిందుకెంతయు సమర్థులు. కనుకనే కృష్ణదేశికేంద్రులు, "వారెరుగని మరుగుండ ద" న్నారు.

## పరిపూర్ణబోధ కధికారియగు శిష్యనిర్ణయము

దారు, మృణ్మయ, శిలా, లోహాదులచే తయారుచేయబడిన విగ్రహాళ ప్రాణప్రతిష్ఠచేసి మంత్రయంత్రాదులచే వానికి శక్తిగల్గించినచో వానిం దైవత్వము గల్గి అవియెట్లు పూజనీయములగుచున్న విధముగా, పూర్ణగు తనశిష్యుని మలినాంతః కరణమును పరిశుద్ధమొనర్చి యందు పరమాత్మను తిష్ఠిత మొనర్చు చున్నాడు. అందువల్ల శిష్యుడు పరమాత్మ స్వరూపుడగు చునా మరియు లోకరక్షకుడే యగుచున్నాడు పరమాత్మ పద్ధతిగల యాతని పరిశుద్ధ కరణమునందు, యేమహత్తుల భ్రాంతికి తావీయడు.

ఇతరవిధములగు శాస్త్రజ్ఞానాది జ్ఞానము లెన్నియున్నా గురునిర్ణయ జ్ఞానమునకు సరిపోవు అట్టి జ్ఞానము, వుపనిషత్తుల యందలి 32 బ్రహ్మవి యందుగాని 14 కామవిద్యలయందుగాని లేదు. అది కేవలం గురుగోప్య నున్నది. ఆత్మయను రత్నము దేనినుండి చేజిక్కునో, వేదాంత సిద్ధాం నందు యేదిప్రౌఢముగ వర్ణింపబడియున్నదో, దేనిప్రఖ్యాతి ప్రపంచమందు వ్యాపించియున్నదో, దేనిప్రకాశమువల్ల మనోబుద్ధ్యాదీంద్రియములు విషయగ్ర గావింప సమర్ధవంతములగుచున్నవో, దేనిద్వారా అచలపరిపూర్ణ పరబ్రహ గుర్తింప శక్యమగునో, అది ఆత్మజ్ఞానమని నిర్ణయము. అట్టి ఆత్మజ్ఞా పొందుటకు, స్థాన, అంగ, ఆత్మ భావ శుశ్రూషలు లోలతగావించుకొను పరిపూర్ణబోధకు ముఖ్యాధికారులు. వారేలక్షణయుతులు ఈ ఆత్మజ్ఞానమనే నే నకు గురుమూర్తి అనుగ్రహమువలన పరిపూర్ణబోదయనే కాటుక లభి యెడల, ఆత్మయొక్క ఆస్తిక నాస్తిక పద్ధతి నశించును. అనగా పరిపూర్ణము యెరుకలేనిదియవి తెలుసుకొన్న తెలివి నశించునూ పరిపూర్ణమెప్పుడును యె కిన్ని స్వతస్సిద్ధమై ఆస్తికముగానే వుండును గాని అది అట్లున్నదని చెప్ప యెరుకలేకుండా పోవును. త్రికరణశుద్ధి పూర్వకమైన ప్రవర్తనకు, చతు శుశ్రూషలు జరుపుకొనుటకు యేలాటి భంగము కలిగినా, వారికి రౌరవాది నర సంభవించును కనుక పూర్ణబోధయందు ప్రవేశించిన శిష్యుడు తన ప్రవర్తనయ

## పరిపూర్ణ పరబాహ్యా నిర్ణయము

అచల పరిపూర్ణ మనునది ఒక వుత్కృష్టస్థానముగాని స్థలముగానికాదు. దేశకాల పద్ధతుల ననుసరించి పదార్ధరూపమున పట్టుబడునది, పొందతగినదికాదు. ఏలననగా, పరిపూర్ణ పరబాహ్యామనునది తనంతట తానే సర్వత్ర అన్నిటియందు లోపల బయట అనే నిర్ణయములేక నిండి నిబిడీకృతమై, ముఖాగ్రసూచ్చ సందులేక నిండియున్నది. కనుక పరిపూర్ణ పరబాహ్యా నిర్ణయము తెలుసుకొనుటకు యెట్టి కష్టము భరింప నవసరములేదు. తనంతటతాను తెలుసుకొనుటకు సాధ్యముకాదు. గురుశిష్య న్యాయములో గురుముఖతః తెలియబడగలదు సాధన సంపత్తులనే నిర్ణయ పద్ధతులన్నియూ పూడ్చిపెట్టి దానిపైన గురుభక్తియనే మందిరము దృఢముగకట్టి, పరిపూర్ణబోధ శ్రవణాభిలాషతో కూడియున్న సింహద్వార మెల్లపుడు తెరచియుంచి, ఆమందిరమున నిందాస్తుతులును, నీవు నేను అను భేద బుద్ధియు భ్రాంతియులేని రత్నములచే పొదుగబడిన అంతఃకరణమనే కలశస్థాపన గావించిన శిష్యుని అంతఃకరణమున మాత్రమే పరిపూర్ణ పరబాహ్యా నిర్ణయము స్థిరముగనిలచి వుండును. తల్లికి ఆమె ఏకైక కుమారునికీ యితర ఆధారము లేనిచో ఒకరిపై నొకరెట్లు ఆధారపడియుందురో, వారిలో వారికి భిన్నాభిప్రాయము లెట్లుండజాలవో, అట్లే శిష్యునికి గురువుతప్ప యితరాధారమేమియు లేదు. వుండ కూడదు. గురువుపైతప్ప శాస్త్రములపైనను మతనిర్ణయములపైనను ఆధార పడరాదు. యితర మంత్ర తంత్రములపైననూ దేవతలపైననూ ఆధారపడి భావ శుశ్రూషకు భంగము వాటిల్లనీయకూడదు. ఇట్టి భక్తిని, గురువుపైనుంచిన నాడే అది గురుభక్తియని చెప్పనగును. ఇట్టి గురుభక్తియనే మందిరము అంతఃకరణ యందెప్పుడు నిర్మాణమగునో, అపుడే భేదబుద్ధి నశించి, పరిపూర్ణబోధ వినుటకు అంతఃకరణ ద్వారములు తెరువబడియుండును. అట్టి లక్షణయుతుడే పరిపూర్ణ బోధవినుటకు వుత్తమాధికారి. అట్టి వానికే ఆ బోధ శీఘ్రముగా నారూఢమగును.

ఏది తానుచూడక పోయినప్పటికీ స్వతస్సిద్ధమై కనుపించునో, తానులేనని లేకపోయినా యేదివుండియే వున్నదో, తన్నుతాను మరచినప్పుడేది జ్ఞాపకమునకు వచ్చునో, అది పరిపూర్ణ పరబాహ్యాము. దానిని తప్పించుకొని వుండుటకు యెట్లు సాధ్యమగును ? అందువలన "అఖిలకాలేషు పరిపూర్ణమస్తి" అని నిర్ణయము.

అచలపరిపూర్ణమందు స్నానమొనర్చినవారి, అహంబ్రహ్మభావం నశించి పోవును పరిపూర్ణబోధ ప్రవాహమునందు, జీవేశ్వర జగదోపాధితో, అధిష్ఠాన చేతన బ్రహ్మమును నేనుగూడా కొట్టుకొని పోవుచున్నాను. ఆ ప్రబోధ విధానము నందు యింత ప్రచండశక్తి యున్నది. కనుక అప్రమేయశక్తి, అయమాత్మ తత్వమస్యాది జ్ఞానరహిత కీలకమని నిర్ణయము. పూర్వపుణ్యవిశేష మున్నవారే యీపరిపూర్ణ పద్ధతియందు నిశ్చలముగా నిలచియుందురు నిలుకడలేనివారికి బోధకలలోనివార్తగా నుండును

## యెరుక నిర్ణయము

సూర్యోదయ మగునపుడు, ఆ సూర్యుని ప్రకాశములోనే సూర్యుని మనము చూడగలుగునట్లు, యెన్నివిధముల చూచినను యెరుకను యెరుకయే చూడగలుగు చున్నది. అన్నియు తననుంచి అయినవిగనుక యెరుకయే యెరుకకు కారణ కార్యములుగా నున్నదని సిద్ధాంతం

జననమరణ సంసార వృక్షము యొక్క మూలబీజమూ, ప్రపంచమునకు జన్మభూమియగు నెరుక, పరిపూర్ణమందు లేనేలేకయున్ననూ, అదిచేయు వ్యవహారమంతయూ మహాబలవత్తరముగా నుండును పరిపూర్ణ పరబ్రహ్మము వలె శాశ్వతమనిపించును. ఐనను, నిద్రవచ్చునపుడు, మనకు మనమే జ్ఞానశూన్యత గావించు కొనునట్లు, దీపము, దీపపుకొడిని సృష్టించి, తనకాంతిని తానే తగ్గించు కొనునట్లు, జ్ఞానా జ్ఞానరూపమగు యెరుక సర్వానికి మూలము. దీనికి మూలమేది, స్థానమేది యని తెలుసుకొనవలయునని యీ యెరుక యెంతప్రయత్నించినను తెలియక పోవడము దీని అశాశ్వతత్వమునకు తార్కాణము.

అజ్ఞానమయమగు సుషుప్త్యవస్థయే యెరుక అనే బీజమునకు స్థానము. దీనిపరిణామము స్వప్నజాగ్రదవస్థలు, ఆసుషుప్తియొక్క అవస్థాంతరములే భావాంతరములే యగును యీ త్రివిధావస్థలకు స్థానమైన అంతఃకరణమునందే, అహం అనేవృత్తి కలిగి దానినుండి, పంచతన్మాత్రలు, పంచభూతములు, స్థావర జంగమ జీవోపాధులయందు అంతిమ యుపాధియగు మానవోపాధివరకు అనగా, బ్రహ్మమునుండి మానవోపాధివరకు పూర్ధ్వమునుండి అధోసృష్టి.

మానవోపాధియందు చాతుర్వర్ణములు, వానియొక్క విధి నిషేధములు తెలియచేయు వేదములు, యిహాపరభోగములకు చతురాశ్రమములు, యజ్ఞయాగాది క్రతువులు, వాని ఫలానుభవము పొందునిమిత్తము, కర్మయాన, పితృయాన దేవయానములు, నవగ్రహములు, నక్షత్రములు, సప్తర్షిమండలము, సత్యలోక వైకుంఠ కైలాసములు, బ్రహ్మస్థానము, చతుర్దశభువనములు, శాస్త్రపురాణేతి హాసములు, మత మతాంతరములు, మానవునిచేత నిర్ణయింపబడినవి వీనికి అధోమూల పూర్ధ్వశాఖలని, నిర్ణయము.

వృక్షమునకు ఫలభారమధికమగునప్పుడు దానికొమ్మలు వృక్షమూలము వరకు వంగిపోవునట్లు, సృష్టిభార మధికమగునప్పుడు బ్రహ్మాండ ప్రళయము జరిగి దాని మూలమగు యెరుక యను అజ్ఞానముతో చేరును. మానవుల, పుణ్యకర్మ ఫలానుభవము క్షీణించగనే, పూర్ధ్వమునుండి పృధివికి, దిగి జన్మాదులు పొందును.

ఏమూలమునుండి జీవేశ్వరజగత్తు పరిణతి పొందుచున్నదో, ఆస్థానముకన్న యితరమేమియు అధికముగా దొరుకబోదు. బ్రహ్మ విష్ణు రుద్రాదులు సహితం తమ తపోబలంచే కొంతవరకు ఆస్థానమునకు చేరువగా చేరగలిగిరి, కాని అప్పటనే ఆగిపోయిరి.

సనకాదులు తమ జ్ఞానబలముచే యెరుక మూలమువరకు వచ్చి నట ఆగిపోయిరి. కనుక ఎంతటి మహాత్ములైనా యేభ్రాంతి మూలమునుండి బైలుదేరి వచ్చిరో, తుట్టతుదకు ఆమూలమునే చేరగలరు. కాని దానిని దాటిపోలేరు. మనుష్యునినుండి బ్రహ్మమువరకు వున్న పూర్ధ్వశాఖ మానవునిచే కల్పింపబడినది కనుక యిది అధోమూలమని నిర్ణయము.

యెరుక మరుపులు, (జ్ఞానా జ్ఞానములు) అను ద్వంద్వరూపము గల యీ యెరుకయే అక్షయమనీ, అవ్యయమనీ ఏల నిర్ణయించిరి? సముద్రజలము, సూర్యుని వుష్ణోగ్రతచే ఆవిరియైపోయి మేఘములై పోవుచుండుటచే తగ్గుచుండును. నదీప్రవాహములచే మరల నిండుచుండును. సముద్రము పూర్తిగా యెండిపోదు, హద్దుమీరి పెరుగదు. అట్లే యెరుకనుండి పంచభూతములు, 84 లక్షల జీవోపాధులు పూర్ధ్వమునుండి అధోభాగము వరకు వచ్చుచుండును. మరియొకవంక ప్రళయము జరుగుచుండును. జీవోపాధులు వానికర్మఫలముల ననుసరించి, కర్మయాన, పితృయాన, దేవయానములలో పయనించి, స్వర్గ, వైకుంఠ, సత్యలోక

కైలాసాది లోకములలోనో, బ్రహ్మస్థానమందో చేరి, పుణ్యకర్మ క్షీణించగా తిరిగి వుపాధి చెందుచుండును. ఇదిగమనించి యీ జీవజగత్తుకు కారణరూపమగు బ్రహ్మమును అక్షయమని, అవ్యయమని నిర్ణయించినారు.

దీని నిజస్వరూపమెట్టిదనగా – నదీప్రవాహమెడతెగకుండా ఆద్యంతము ప్రవహించుచునే వుండును. విచారించి వస్తు నిర్ణయముగా తెలుసు కొన్న వారలు దాని యునికి భ్రాంతి జన్యమని తెలియుచుందురు. క్రొత్త నీరు వచ్చుచూ పాతనీరు పోవుచూ నున్నపుడు అది శాశ్వతమని యేరీతిగాను అనరాదు గదా! కాని వస్తువును విచారించనివారు. జీవేశ్వర జగత్తులకు మూలమైన యెరుక శాశ్వత సత్యమనీ, అవ్యయమనీ, జీవమెన్నడూ నాశమొందదనీ, జీవుడు బ్రహ్మమునకు వేరుకాదనీ, వేదశాస్త్రప్రమాణములచే నిర్ణయింతురు.

కాల ప్రవాహమున భూతకాలము గడచిపోవును. వర్తమానమందు తాను, భవిష్యత్తునందు తన సంతతి వుంటూవున్నట్లు తెలియును. గడచిన కాలములో తన తండ్రిపోయినను, తండ్రిస్థానే తానిప్పుడున్నట్లు తాను పోతే తన స్థానమున తన కుమారుడుండునట్లు, తన పితృపితామహులు, తానూ, తనసంతతి వంశ పరంపరగా యెడతెగకుండా వుంటూవున్నట్లు జీవేశ్వరులు, అధిష్ఠాన చేతన బ్రహ్మమగు యెరుక అనంతముగా అవ్యయమై యుండునని వారు నిర్ణయించు చున్నారు.

## భ్రాంతిపరుల నిర్ణయము

సూర్య, చంద్ర, మలయమారుతాది, సంసర్గము వలనను, అష్టవిధ ఐశ్వర్యముల వల్లను, తల్లియే సుఖమనుభవించ గల్గునేగాని ఆమె గర్భకోశమున చిక్కియున్న పిండస్త శిశువు, అనుభవించజాలనట్లుగా ఆవరణ రహితము నందువున్న పరిపూర్ణులు, జననమరణ దుఃఖరహిత పూర్ణశాంతి సౌఖ్యములను భవింతురు, గావి ఆవరణమునందు ఉన్నమత సాంప్రదాయకులు సకల దుఃఖములనే అనుభవింతురు. గ్రుడ్డివాడు సూర్యుని యెండ తీక్ష్ణత వలన కలిగే దుఃఖమునే అనుభవించును కాని, సూర్యప్రకాశములో ఏసుందరదృశ్యమునూ చూచి ఆనందించలేడు గదా!

వర్షపాతము వలన చిన్న పెద్దనదీ ప్రవాహములు యేర్పడుచు చిన్న ప్రవాహము గొప్ప నదీప్రవాహములో చేరి ప్రవహించుచున్నపుడు పిల్లనది పోయి పెద్దనదిలో చేరి పూర్ణత్వము చెందినదని సంతోషించుచునుగాని చలన రూపంగా ప్రవహించే లక్షణము మాత్రము పోనేలేదని యేల విమర్శించరో !

మహిషాసురమర్దనమును బంగారముచే విగ్రహరూపంగా ఆలయమునందు ప్రతిష్ఠించినపుడు, అన్నియు బంగారముచేతనే చేయబడిన విగ్రహములే అయినను, అందు నిజముగా యెట్టి వ్యత్యాసము లేకపోయినను, పూజారి కల్పించుకొని, మహిషాసురుని. కాళికాదేవి, శూలముతో యెట్లు చంపుచున్నదో నని కథను కల్పించి, చెప్పి చూపించినపుడు, మానవ లోకము చూచి విని నమ్ముచున్నది.

ఒక చిత్రమునందు ఒక వంక అగ్నిజ్వాలలు దహించుచున్నట్లు, మరొక వంక సముద్రము పొంగి గ్రామాదులను ముంచివేయుచున్నట్లు, చిత్రించబడి వుండునేగాని ఆ చిత్రమునందలి అగ్ని దేనినైన కాల్చివేయగలదా ? చిత్రములోని ఆ సముద్రజలములు దేనినైన తడుపగలవా ? అట్లే చిత్రమందలి జలాగ్నులకు మన మెట్లు భయకంపాదులు చెందుట లేదో, పరిపూర్ణభావజ్ఞులు జననమరణ దృశ్యముల చూచి భయభ్రాంతులు చెందబోరు

భుజించిన అన్నపానాదులు జఠరాగ్నివలననే పచనమై శరీరమును పోషింపుచున్నవి ఆ జఠరాగ్ని అధికమగునపుడు మరణము కలుగును. పోషించు నదియు మరణము చెందించునదియు ఆయగ్నియే, అట్లేగాలి తగినంత వున్నపుడే దీపము మండును ఆ గాలి అధికమగుచోదీపమే యారిపోవును, రక్షించుటకు భక్షించుటకు కూడా, ఆవాయువే కారణమై యున్నది అట్లే సృష్టిస్థితిలయ విస్తీర్ణ ఆకర్షణలకు యెరుకయే కారణకార్యములుగా వున్నది. యెరుకకు పరిపూర్ణమునందు మూలమే లేదు కనుక అనిత్యమనియే యనవలసి వచ్చెను. యెరుకను శాశ్వతమని నమ్మేవారు భ్రాంతిపరులని చెప్పనగును.

## 6. మోక్షభ్రాంతియందలి భీతి

1. చందన వృక్షమునుచుట్టి సర్పములుండును. దాని నాశించు వారికి సర్పభీతి తప్పదు.

2 భూమియందు గుప్తముగా దాచివున్న ధనమును పిశాచములు ఆవరించి వుండును ఆధనమాసించినవారికి పిశాచభీతి.

3. నాగసర్పమునకు శిరస్సున మాణిక్యముండును దానినాసించినవారికి ఆసర్పభీతి తప్పదు.

4 కాశీక్షేత్రము మోక్షమొసంగును. ఎవ్వరికి ? ఆ క్షేత్రమున మరణించిన వారికే

5. హిమాలయములయందు తపస్సుచేసినవారి పాపములు నశించును కాని ఆ చలిబాధవలన ప్రాణమే పోవచ్చును.

6. గంగాస్నానము వలన పవిత్రుడగును. శరీర సౌఖ్యమున్ను గలుగును. కాని అందుమునిగి పోయినచో ప్రాణములే పోవును.

అట్లే నామరూపాత్మక జగత్తు తన స్వస్థానమున శూన్యముగానే యున్నది. అనగా నాశనశీలము గలదిగానే యున్నది. కనుక దానిని మంత్ర, లయ, హఠ, రాజయోగములద్వారా సాధించదలచినవారు శూన్యపద్ధతినే పొందుదురు.

ఆకాశావరణమున్ను పూర్ణముగానే యున్నది. నేనే ఆపూర్ణమునని ఆకాశము నందైక్యధ్యాన మొనర్చినచో జడరూప అజ్ఞానస్థితి కలుగును,

అధిష్ఠానచేతన బ్రహ్మము పూర్ణముగాయున్నది యని తెలిసి మహావాక్య చతుష్టయ పద్ధతిగను, వార్తికనిర్ణయానుసారమున్ను, దాని యందైక్యసాధన యొనర్చినచో అహంభావన వృద్ధియగును.

కనుక అహంభావనను సంపూర్ణముగ వదలిననేగాని అచలపరిపూర్ణము నందు, కలియకనే, కలియుట జరుగదు. అనగా ఆపరిపూర్ణము అంధకారముగాని ప్రకాశముగాని కాదు. నీకు దానియందైక్యత సిద్ధించదు. ఐననూ, దాని పూర్ణపద్ధతి నీకు గోచరమై, ఆగామిరహిత కర్మాచరణవల్ల జన్మభ్రాంతి తొలగిపోవును. జన్మభ్రాంతిలేదా పరిపూర్ణమే నీ అహంభావన పోవుటయే ఆపరిపూర్ణమునందు కలియకనే కలియుట.

అధ్యాత్మ శాస్త్రములో సత్యమును సిద్ధింపచేయుపట్ల ఏమని చెప్ప బడినదనగా

శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవాఽవశిష్యతే॥

అనగా పరోక్షపూర్ణమగు పరిపూర్ణనకు ప్రత్యక్షపూర్ణమగు యెరుకకు, కలియక వున్నదాయనే నిర్ణయము చేయవలసినప్పుడు, దానికి అనగా పరిపూర్ణము నకు యెరుకకు యేలాటి సంబంధము లేదనియే చెప్పవలసివచ్చును. సంబంధము కలదని చెప్పుశాస్త్రము లేమైనయున్నచో అవన్నియు సత్యముకాదని చెప్పనగును.

యెరుకయే ఆపరిపూర్ణ బ్రహ్మమను అభిమానమున్నవారిగతి ఏమగును ? అనగా

1. ఆకలితో నున్నవాడు మొగమాటపడి తినకొన్నచో ఆకలితో బాధపడు చుండుటయే గాక అనృతదోషము కూడా వచ్చును. అందువల్ల ఆతడాత్మ ఘాతుకుడగును.

2 సర్వజ్ఞుడగు సద్గురువు తనకులభించినపుడు, అభిమానముచేత "నేను చతుర్వేద పారంగతుడను పండితుడను. నాకు తెలియనిది ఏమి వుండును ? ఐనా గురూపదేశవాక్యము ఒకసారైనా విందాము" అని నిర్లక్ష్యముగా నుండి వినడము; లేదా "నేను వర్ణాశ్రమ ధర్మముల యందు గొప్పవాడను" ఆ రహస్యము యేమో తెలుసుకొంటే చాలు" ననుకొని, యెరుక పరిపూర్ణముల నిర్ణయము, ఎరుకను విడచేపద్ధతి పూర్తిగా తెలుసుకోక పోవడము; నిన్ను నీవే మోసగించుకొనడ మగును. అంతేగాక ఆత్మవంచన చేసుకొన్నవాడవగుదువు. కనుక జన్మరహిత విధానముకొరకు నిర్ణయించిన అచలపరిపూర్ణము యెరుక నిర్ణయము, యెరుకను విడచేపద్ధతి, బుద్ధినిశ్చయము కలుగుటతో మాత్రము తృప్తిజెందక ఆత్మనిశ్చయమయ్యే పర్యంతము, పలుమారు విచారించి తెలిసికొనవలయును. అపుడు యేలాటి భయభ్రాంతులు నిన్నంటజాలవు.

3. మనముఖము చూచుకొనవలయు నన్నచో ఆ యద్దమును మనమే తయారు చేసుకొనవలయును, దానిని మనమే పరిశుద్ధమొనర్చుకొను చుండవలెను ఆపరిశుభ్రత తనకొరకేయని గుర్తెరిగి యుండ

వలయును. తన అంతఃకరణవృత్తి సార్థకమా అనర్థకమా యని తెలుసుకొనుటకు, పరిశుద్ధమైన అద్దము తనదిగానే యుండవలయునూ యితర మతశాస్త్రపద్ధతులు వుండకూడదు.

## 7. పరిపూర్ణబోధ సాంప్రదాయక పద్ధతి

"దుర్లభం మానుషందేహం, వివేకమతి దుర్లభం" అనే న్యాయమున వివేక జ్ఞానము కలుగుట చాలకష్టము. ఇందుకు త్రికరణశుద్ధి ముఖ్యావసరము. త్రికరణములు అనగా 1. మనస్సు 2. వాక్కు 3. శరీరము. యీ త్రికరణముల సంయమనము వల్లగాని త్రికరణశుద్ధి కలుగదు. 1. మనోసంయమనము 2. వాక్సంయమనము 3. శరీరసంయమనము.

### శరీరసంయమన లక్షణము

శరీరమునందు, పృథ్వీఅంశములగు నరములు, అస్థులు, చర్మమూ, మాంసం, రోమములు, జలఅంశములగు, రక్తము, మూత్రము, చెమట, చొల్లు, శుక్లము; అగ్నిఅంశములు ఆకలి, దప్పి, నిద్రసంగమము ఆలస్యము; వాయు వంశములు చాచుట, నడచుట, దాటుట, పరుగుట, ముడుచుట. ఆకాశాంశములు కామ, క్రోధ, లోభ, లజ్జ, భయము; ఈసముదాయమునకు ప్రాణము ఆధారము కనుక ప్రాణమును శరీరమని చెప్పబడినది.

వీనిని పంచభూతముతో సమముగ ప్రవర్తింపచేయవలెను. అనగా-ఆకాశము యొక్క ఆవరణమునందు, వాయువు, అగ్ని, జలము, పృధివి, సూర్యచంద్ర నక్షత్రములు చలించుచున్నను, ఆకాశావరణమును యెట్లు వీడిపోవుటలేదో, సము ద్రమునందలి యలలు, సముద్రము యొక్క హద్దులను యెట్లు విడచిపోవుటలేదో, అట్లు శాంతి శమాది పద్ధతులయందే శరీరమును ప్రవర్తింపచేయవలెను ఇది శరీర సంయమనమని నిర్ణయము. పరమాత్మచే నిర్మాణమైన యీశరీరమును పరమాత్మ నిర్ణయానుసారమే అనగా మానవలోక కల్యాణమునకు అనుకూలమగు సేవా కార్యమునందే శరీరమును ప్రవర్తింప చేయవలెను తన యిచ్ఛానుసారము ప్రవర్తించరాదు. అది నరకము కలిగించును.

## వాక్సంయ మనము

ఆకాశమునకు గుణము ధ్వన్యాత్మకమగు శబ్దము. అది పరమాత్మసృష్టిలో వైఖరీవాక్కుగా వర్ణాత్మకమైనది. వేదశాస్త్రపురాణేతిహాసములు ధర్మశాస్త్రములు యుగ యుగాంతరములనుండి మహాపురుషుల సందేశములు, వర్ణాత్మకముగానే మన కందింపబడినవి ఆయామహాత్ములు కాలగర్భమున మరుగుపడినా, ఆ గ్రంథ రాజములు నశించక మానవులను ధర్మపరులనుగా చేయుచున్నవి అట్టి వర్ణాత్మక మగు వాక్కు పరమాత్మ నిర్ణయమని తెలిసికొని, మన కర్మాచరణ విధానము లన్నియు సత్యమార్గమునే అనుసరించవలెను. అసత్యపద్ధతిలో నుండరాదు. మానవులకు, యితర జంగమజీవులకు వాక్కు నిర్మితపద్ధతి యందే భిన్నత్వము కాన వచ్చు చున్నది వాక్యనిర్ణయము తెలుసుకొని ఆ పద్ధతిగానే వ్యవహారమునల్పి మానవుడు ఆనందింపగలుగు చున్నాడు. యితరజంగమ జీవులకిది సాధ్యముకాదు. అందువలన, మానవుడే శ్రేష్టుడని సర్వాంగీకారమైన విషయమై వున్నది మానవులలోనూ వాక్కు పరమాత్మ నిర్ణయమని తెలిసి, వాక్సంయమనమునకల్గి సత్యవంతుడగు మానవుడే పరమశ్రేష్టుడు.

## మనోసంయమనము

శ్రుతి :- "ఏకోహం బహుశ్యాం" అని సంకల్పించిన సంకల్పపురుషుని వల్లనే మనోమయ కోశము పుట్టినది తన నిత్యజీవిత విధానములో జ్ఞానేంద్రియ ములచే విషయపంచకమును తెలిసుకొని కర్మేంద్రియములచే కర్మచేయును. అట్టి కర్మ అధిష్ఠానసంకల్పరూప సమష్టిపద్ధతిగా ఆచరించవలయునేగాని, అధ్యాత్మ. ఆదిభౌతిక అధిదైవిక రూపంగా అనగా వ్యష్టిపద్ధతిగా వుండరాదు.

సమష్టి సంకల్పసృష్టియందు సకల జీవోపాధులకు, ఆకలిదప్పి నిద్రా మరణములు సమానములే. యోగికైనా భోగికైనా విద్యావంతునికైనా విద్యా విహీనునికైనా, బాలునికైనా వృద్ధునికైనా సమానముగానే వుండును కనుక అదేరీతిగా మానవుని కర్మాచరణము అధిష్ఠానసంకల్ప పద్ధతిగానే యుండవలెను. యిదే మనోసంయమనము.

యీ త్రివిధసంయమన పద్ధతి తెలియనివారు, కర్మాచరణ, బంధమని నిర్ణ యించెదరు. ఆకలివేయును. అన్నముతింటే పోవును తిరిగి ఆకలిఅగును. తిరిగి

తినవలెను. అదేపదతిగ జన్మలున్ను కలుగును. బాల్యయవ్వన కౌమారవార్ధక్యములు పొంది మరణించి తిరగి జన్మముపొందును. కనుక యీకర్మ యెన్నిటికీ వదిలేది కాదు కనుక కర్మను సంపూర్ణముగ త్యజించి కొందరు సన్యాసాశ్రమమునందు ప్రవేశించుచున్నారు. కర్మను పూర్తిగా త్యజించుట యెన్నటికీ సాధ్యముకాదు కనుక, కర్మచేస్తూ దానిఫలము పరమాత్మార్పణ చేయడమే త్యాగమని మరికొందరి నిర్ణయం వీరిగతి అధోగతియే. ఏలననగా-యిష్టముంటే నొసట బొట్టుపెట్టుకొన వచ్చును లేదా మానవచ్చును. కాని నొసలునే తీసివేయుట సాధ్యముకాదు అట్లే మతనిర్ణయ పద్ధతులు యిష్టాయిష్టముల ననుసరించి పూనవచ్చును లేదా మాన వచ్చును కాని శరీరోపాధికి వచ్చినవారు, కర్మలు విడువగలమనుట వెఱ్ఱితనము ఉపాధికి కారణరూపమగు యెరుకప్రాణరూపముగా జన్మదారభ్యాజాగ్రత స్వప్న సుషుప్తులయందు నిలుకడలేక ప్రవర్తించి బాల్యయౌవనకౌమార వార్ధక్యములు కలి గించి, తుదకు మరణము చెందించును. మరణానంతరము, కర్మయాన, పితౄయాన, దేవయానముల గుండా పుణ్యపాపలోకముల చెందించును. మరల, కర్మాను గుణ్యముగ నీచోత్తమ వుపాధులయందు పుట్టించును. కర్మను విడచుట దుస్తరము కర్మాచరణ యొనర్చు పరికరములనున్న విడువజాలడు.

1 స్థూలశరీరము క్రియారూపమగు సకలవ్యవహారములకు మూలము శరీరమునకు సంభవించు సుఖదుఃఖములకు స్థానము. ఇదే పురుషునికి నివాసస్థానము యిది సకల బంధమోక్షక్రియలకు కర్మాగారము. జాగ్రత స్వప్న సుషుప్తి తురీయ తురీయాతీతావస్థలు దీనియందే జరుగును. కనుక యిది సకల కర్మలకు అధిష్ఠాన కారణము.

2. ప్రత్యగాత్మయేకర్త. దేహమునకు తాను కర్తగానుండి సర్వకర్మలు జర్పించవలయుననే అభిమానము రెండవ కారణము.

3 జ్ఞానేంద్రియముల ద్వారా విషయపంచకము తెలుసుకొను బుద్ధి 3 వ కారణము.

4 ప్రాణేంద్రియములు, అనగా సమానవ్యాన ఉదానప్రాణ అపానములు, వాక్కుపాణి పాదగుహ్యాగుదములనే కర్మేంద్రియముల ద్వారా వచన

దానగమున ఆనంద విసర్జనములు అను కర్మలొనర్చి నాభిస్థానమందు స్థిరపడి వుండును గనుక ప్రాణము నాలుగవ కారణము.

౫. ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక్క అధిష్టానదేవత యుండును యీ యింద్రియాధిష్ఠానదేవతలను ప్రకాశమొనర్చువాడు ఆదిత్యుడను సూర్యుడు, సూర్యుని ప్రకాశింపచేయునది సర్వాధిష్ఠానమగు అఖండ యెరుక. యీ అధిదేవతల అనుగ్రహముచేతనే యింద్రియ వ్యవహారము జరుగుచున్నది గనుక వీరే కర్మలకు ఐదవ కారణము. సకల కర్మలకు యీ ఐదున్ను కారణములుగా నున్నవి

ృష్టియన కర్మయే కర్మయనగా సృష్టియే సృష్టింపబడిన సమస్తం ంద్ర నవగ్రహ నక్షత్రములన్నియు "ఏకోహం బహుస్యాం" అనగా, ననే అన్నిరూపములు గావలెనని సంకల్పపురుషుని నిర్ణయము. కనుక కర్మస్వరూపమే. కనుక సన్యాసము స్వీకరించి కర్మత్యాగ మొనర్చగలను లేక అవసరమగు కర్మలుమాత్రమేచేసి పరమాత్మకా కర్మఫలములు, నని గాని చెప్పి ఆ పద్ధతిగా నాచరించడము హాస్యాస్పదము.

## జన్మకర్మరహితమునకు

*రుకశరీర నిర్ణయము* :- యెరుకకు పృధివిపాదములు జలంకటి అగ్ని ం, వాయువు కంఠము, ఆకాశము శిరస్సు

*స్థూలదేహ నిర్ణయము* :- కామక్రోధ లోభమోహ భయములు ఆకాశాంశములు.

. ప్రసరణం, చాంచల్యం, ఆతిగమనం, భ్రమణం, ఆకుంచనం, వాయువంశములు.

. నిద్ర సంగమము, క్షుధ, తృష్ణ, ఆలస్యం, అగ్నియొక్క అంశములు.

4. శ్లేష్మం, శుక్లం, రక్తం, మూత్రం, మేధస్సు. వుదక అంశములు

5. రోమములు, త్వక్కు, మాంసం, నాడి, అస్తులు పృధివి అంశములు.

6 స్థూలదేహ లక్షణము :- సూర్యుడే నేత్రముగా వుండును కనుక నేత్రము స్థానమని చెప్పబడును. రాత్రిపగలు అనే నిర్ణయము లేక వుండును కనుక జాగ్రదవస్థయని నిర్ణయము. మానవలోక కల్యాణము నకు వలయు మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్యసహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధి పెంపొందుటకు కర్మయొనర్చును. గనుక యెరుకను విశ్వాభిమాని యనవలసెను 1. ఉత్పత్తి 2. జాగ్రత 3. బోధ 4. వ్యాపారం యివి యెరుక యొక్క కళలు, అపాద మస్తక ప్రమాణం.

## 10. సూక్ష్మదేహ నిర్ణయం

1. అంతఃకరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము-ఆకాశాంశ అధ్యాత్మికములు

2. వ్యానము, సమానము, వుదానం, ప్రాణం, అపానము, వాయువాంశ అధ్యాత్మికములు.

3. శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణం, తేజోంశ అధ్యాత్మికములు.

4. శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం, జలాంశ అధ్యాత్మికములు.

5. వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదము, పృధివ్యాంశ అధ్యాత్మికములు

### సూక్ష్మదేహ లక్షణము

యెరుక పురుషునికి వాయువు గళము కనుక అధ్యాత్మరూప సూక్ష్మ శరీరమునకు కంఠస్థానమని నిర్ణయము. అపాదమస్తక ప్రమాణం తన

ప్రకాశమునందే తాను వ్యవహరించును కనుక అభిమాని తైజసుడు. అధ్యాత్మలు సూక్ష్మపద్ధతి గలవి కనుక సూక్ష్మవస్తుయని నిర్ణయం. జలముయొక్క ప్రత్యేక కళలు 1. సాదృశ్యం. 2. అసాదృశ్యం, 3. యాదృశ్యం, 4. తాదృశ్యం అని నిర్ణయము

## 11. కారణదేహ నిర్ణయం

1. అవకాశం, విస్మృతి, ఆవరణం, నిరావరణం, అప్రమాణం, ఆకాశ పద్ధతులు

2. భ్రాంతి, శంక, శోషణం, శిథిలీకరణం, ధీరత్వం. వాయువు పద్ధతులు

3. గూఢం, రూఢం, కృతజ్ఞత, అవిచారం, సంశ్లేషం-తేజస్సు పద్ధతులు,

4. మృదుత్వం, పోషకత్వం, విశదత్వం. క్లేదనత్వం, ధారణత్వం-జల పద్ధతులు

5 మూర్తత్వం, శబలత్వం, లజ్జ, పిండీకరణం, కాఠిన్యత - పృధివీ పద్ధతులు.

### కారణదేహ లక్షణం

యెరుకపురుషునికి, అగ్నిహృదయస్థానం. కనుక కారణదేహమునకు హృదయస్థానమని నిర్ణయం. ఆపాదమస్తక ప్రమాణం. ఇతర అభిమానం లేకుండ స్వయముగ సర్వము తన సమర్థతతోనే యొనర్చును కనుక ప్రాజ్ఞుడభిమానియని నిర్ణయం. తనయందు తాను ఆశ్రయుడు కావున సుషుప్తి అవస్థ నిర్ణయం అగ్నియొక్క ప్రత్యేక కళలు 1. మరణం, 2 విస్మృతి. 3. మూర్ఛ, 4. నిద్ర.

## 12. మహాకారణదేహ నిర్ణయం

1. పూర్ణత్వం, అసంగత్వం, వ్యాపకత్వం, సర్వబీజకత్వం, అఖండత్వం ఆకాశ నిర్ణయములు

2 అఖండత్వం, అభేదత్వం, పరాత్పరత్వం, నిర్మలత్వం, అజరత్వం వాయువు నిర్ణయములు.

3. ఆదాయత్వం, పూర్ధ్వపదత్వం, ప్రకాశత్వం, చైతన్యత్వం, అనర్ఘత్వం తేజస్సు నిర్ణయములు.

4. అక్లేద్యత్వం, జగజ్జీవత్వం, పరంజ్యోతిత్వం, అమృతత్వం, కారుణ్యత్వం జలం నిర్ణయములు.

5. అశోషత్వం, కారణత్వం, పావనత్వం, సంపద్యత్వం, సర్వధారత్వం పృధివీ నిర్ణయములు.

## మహాకారణ దేహలక్షణము

యెరుకపురుషునికి ఆకాశము శిరము కనుక మూర్ధ్నిస్థానమని నిర్ణయము. ఆపాదమస్తక ప్రమాణం, యెరుకపురుషుడు తనకు తానే స్వయా అభిమాని. స్వనిర్ణయపద్ధతి. తురీయావస్థయని నిర్ణయము యెరుకపురుషుని యొక్క ప్రత్యేక కళలు. 1. వైరాగ్యం, 2. ముముక్షత్వం, 3. ఆత్మతత్వంపద దర్శనము, 4. తుర్యావస్థ.

త్రివిధ సంయమనములు తెలిసికొని ప్రవర్తించువారు స్వయంగా అధిష్ఠాన చేతన పరబ్రహ్మమగు అఖండయెరుకగా ప్రవర్తించెదరు. కనుక వారికి జీవోపాధి పద్ధతులుండవు. జీవపద్ధతులనగా – నాలుగుమేనులు నాలుగవస్థలు, నలుగురభిమానులు – అనగా స్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములు, జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలు, విశ్వతైజసప్రాజ్ఞ ప్రత్యగాత్మలను అభిమానులు అను, క్షరపురుష పద్ధతులుండవు కేవల అక్షర పురుషుడుగానే ప్రవర్తించును; కాని తన వునికి తాను విచారించి చూడగా, జనన మరణ సంసారబాధ తన వునికియందే వున్నదని తెలుసుకొని తన రహితమునకు పరిపూర్ణ గురుసార్వభౌముల నాశ్రయించి. వారి అనుగ్రహామువలన పరిపూర్ణ పరబ్రహ్మము తెలుసుకొని, క్షరాక్షర పురుషభ్రాంతి విడచి, వుత్తమ పురుషపద్ధతిగా ప్రవర్తించుటకు, కైవల్యదేహం నిర్ణయించుకొనును.

1. మహాకాశం, దహారాకాశం, నిరవయవాకాశం, సూర్యాకాశం, భూతాకాశం, నిర్విషయ అంతఃకరణము.

2. ఆత్మారామత్వం, అనావృత చైతన్యత్వం, చిదీశ్వరభావమఖిల లీనత్వం, సత్యజ్ఞాన మనంతలక్షణ పరతం, అంతర్బాహ్యస్ఫూర్తి రహితత్వం, నిర్విషయ సమానాదులు.

3. స్వయంజ్యోతిత్వం, పరంజ్యోతిత్వం, జ్యోతిర్మయత్వం, ఆపోజ్యోతిత్వం, జగజ్యోతిత్వం - నిర్విషయ రూపాదులు.

4. పరామృతత్వం, పరమసత్వం, తత్వామృతత్వం, అమృతత్వం, బోధామృతత్వం - నిర్విషయ రసాదులు.

5. భేదాభేదాతీతత్వం, అభేదాభేదత్వం, భేదాభేదత్వం, అఖండత్వం, ద్వయత్వం - నిర్విషయ గంధాదులు.

కైవల్యదేహ లక్షణం

ఆకాశము, వాయువు, అగ్ని, జల, పృధ్వి, కూటస్థుడు (ఆకాశాదికము) లీల సూచనలు కైవల్యదేహము. నిర్గుణము. అచలపరిపూర్ణ అద్వితీయమునందు కానసగును. ఇది అనుభవనీయము.

## 14. నిర్విషయాంతఃకరణము

నిర్విషయాంతఃకరణమనగా జీవేశ్వర జగద్భ్రాంతి, గొప్ప ప్రతిష్ఠలభ్రాంతి తాను వున్నాను, లేను, అనే భ్రాంతియు లేకుండ నుండుట. అనగా క్షరాక్షర పురుషుల వునికి పరిపూర్ణమునందులేని నిర్ణయము తెలిసినందున, వుత్తమ పురుషుడుగా నుండును. అనగా, యెండమావులు జలరూపంగా వున్నట్లు తెలియు

చుండును అనగా యెండమావులు అగుపడడమే గాని వస్తువు నిజముగాలేనట్లు, వుత్తమ పురుషుడు చేయునది యేమియు లేనందున అంతఃకరణము నిర్విషయముగా నుండును.

ఆదిత్యుడగు సూర్యభగవానుడు, కాలత్రయములకు కారణముగా వున్నను, సముద్రజలాకర్షణము, మేఘమండలము వరకే ఆకర్షింపబడునట్లు.

నీటియందలి తామరకమలము, కిరణాకర్షణచేత వికసించినను, భూమిపై నున్నగడ్డి, సూర్యకాంతమణులు, కాలి భస్మీపటములైనను, ఆదిత్యునికి తెలియనట్లు

నిర్విషయాంతఃకరణ ప్రవర్తనయందు జరిగిన కర్మేంద్రియ వ్యాపారము అనగా వచనదానగమన ఆనందవిసర్జన విషయములవలన గలుగు ఫలములు, వసుధైక కుటుంబరక్షణ పద్ధతిగానే వుండును. వారికేమియు నంటవు. సకాలము నకు వర్షములు కురిసి పంటలు విరివిగాపండి లోకము లోకులు సుఖసంపదలతో తులతూగు చున్నచో ఆపుణ్యమెవరికి చెందును ? అధిక వర్షపాతము వలన నదీనదములు సముద్రములు పొంగి పల్లెలు పట్టణములు కొట్టుకొనిపోతే ఆపాపము యెవరికిచెందును ? అట్లే నిర్విషయ అంతఃకరణపరులు ఆచరించు కర్మఫలములు యెవరికి చెందును ? ఆ కర్మలు అన్నియు సత్యధర్మపద్దతిగానే వుండును యెవరికి యెట్టి అపకారము కలిగింపజాలవు.

## నిర్విషయ సమానాదులు

నిర్విషయ సమానాదులనగా పిండాండమును భరించు ప్రాణపంచకము పిండాండ వ్యవహారస్పర్శలు తెలుసుకొనును. బ్రహ్మాండమును భరించు ప్రాణ పంచకము బ్రహ్మాండస్పర్శలు తెలుసుకొనును. క్షరాక్షర పురుషద్వయ పద్ధతులు జన్మరహితమగు శరీరమునకు పనికిరావు నిర్విషయ సమానాదులు ఎట్లుండుననగా – ఆకాశావరణమునందు, వాయువు వీచునపుడు, వృక్షములనుండి, పూవులనుండి, సువాసనలు, పెంటకుప్పలనుండి, మలినపదార్థములనుండి దుర్వాసనలు మోసుకొని వచ్చునేగాని ఆవాసనల గ్రహించి వానివల్ల తాను సుఖదుఃఖములు పొందదు.

ఆ సుగంధ దుర్గంధములు నాసికేంద్రమునకు చేరును; వానిని గ్రహించినవాడు సంతోషా సంతోషములు చెందునేగాని, వానిని మోసుకొనితెచ్చిన వాయువునకు యెట్టి సంతోషా సంతోషములు నుండవు. అట్లే నిర్విషయ సమానాదు లుండును.

క్షరాక్షర పురుషులకు, ప్రకృతి పరమాత్మల స్పర్శలవసరము కాని వుత్తమ పురుషుడు, పరిపూర్ణముతో ననన్యముగా నున్నందున యేస్పర్శను గ్రహించడు. ఆతనివలన జరుగు కార్యక్రమముల స్పర్శలు, ఆతని అశరీరపద్ధతికి భంగము కలుగకుండ, ఆతనిని అనుసరించిన వారికి చేరును.

## నిర్విషయ రూపాదులు

దరిద్రునినుండి, నవఖండమండలాధిపతివరకు వుండు సుఖదుఃఖములు, భక్తునినుండి బ్రహ్మవేత్తవరకునుండు బంధమోక్షస్వరూపములు, ఆపోజ్యోతి, పరంజ్యోతి, జీవేశ్వరైక్యము, అహంబ్రహ్మాస్మీతి మహావాక్యనిర్ణయములు, వార్తికపద్ధతి, మొదలగునవి, జన్మాదులనే కలిగించును. కాని వుత్తమపురుషుడు మాత్రము నిర్విషయ పద్ధతిగానే యుండును ఏరూపభ్రాంతియు పొందడు.

## నిర్విషయ రసాదులు

జిహ్వారుచులు, వుపస్థరుచులు, సప్తధాతువులను వృద్ధిపరచు, మధుమాంస మత్స్యములను భుజించి, మైధునక్రియలొనర్చి, యిహసుఖమనుభవించి సంతానము గని, సంతానముపెట్టు పిండప్రదానాదులవలన స్వర్గగతులు పొందగలననే పద్ధతులు, ప్రధమమున సుఖముగానున్నను, తదుపరి దుఃఖమునే కల్గించునవిగా యున్నందున, వానిని విడచి, యోగాదిపద్ధతులవలన, జీవేశ్వరైక్య ఆనందములు, అనుభవింతుననుకొన్నను, గాని యివన్నియు జన్మాదులకే కారణమని, యీరస రుచిని మరిపించే రుచినే కోరుచుండును. జిహ్వారసమురుచి, అంగరసము ప్రాణము ప్రాణరసము ఆత్మ. ఆత్మరసమును రహితపరుచునది పరిపూర్ణము. కనుక,

కం॥ రసమన దగనిది, బసవన్నకదెట్టులెరుక, ప్రభువుకు దెలుసున్
రసమైతె విసము, నసిగాదాముచ్చటంత చవులవినుటకై॥

కం॥ నాబోతురుచికి రుచినిదు యీబోధ నపేక్షచేత నేర్చినవారిన్
యేబాధలు బాధింపవు, బాబూయిది. నీవునేర్చి పఠియింపగదే॥

పరిపూర్ణ స్థిరతవలన, మరలజన్మలేదనే నిర్ణయము, అంతఃకరణమున నిండి పురుషోత్తము డుండును ఆరుచిముందు యేరుచులు పనికిరావు. కనుక యిహపరాదుల రుచులకు రుచిని చేకూర్చె రుచియని, వానిని మరపించేరుచియని, నిర్విషయ రసాదులని నిర్ణయము.

## నిర్విషయ గంధాదులు

గంధాదులనగా వాసనలు లేక సంబంధములు. 1. భార్యాభర్తల సంబంధము. 2. పితాపుత్ర సంబంధము, 3. రక్ష్యరక్షక సంబంధము, 4. శేషిశేష సంబంధం (అనగా సర్వజన సంరక్షకుడైన శ్రీమన్నారాయణకు భక్తులకుగల సంబంధము), 5 జ్ఞాతృజ్ఞాన సంబంధము, 6 స్వామిభృత్య సంబంధము, 7. శరీరీ శరీర సంబంధము, 8. ఆధారాధేయ సంబంధము, 9 భోక్తృభోగ సంబంధము అనగా అనుభవించువాడు అనుభవించదగిన ధనకనకవస్తువాహనాదులు రాజ్యభోగములు ఈ నవవిధ సంబంధములయందు భ్రాంతిలేకుండచేయు ఆచరణ నిర్విషయ గంధాదులని నిర్ణయము.

## నిర్విషయ కామాదులు

నూతనముగా యేదికోరదగినది లేకుండా, వున్నది వున్నట్లు ఆచరించుట, నిర్విషయ కామాదులు అని నిర్ణయము.

## నిర్విషయ కర్మాదులు

తానాచరించు కర్మలు మానవ సౌభ్రాత్రుత్వము, అన్యోన్యసహకారము

ఐహికాముష్మిక పురోభివృద్ధికి అనుకూలంగా నుండవలయును తన స్వార్ధము కొరకు యేదియు నుండకూడదు వుంటే నరకప్రాప్తియే.

## నిర్విషయ తమసాదులు

నిర్విషయతమసాదులు - కామక్రోధ లోభములు, లోకకల్యాణ కరములుగా నుండవలెను అనగా, శిష్టాచారపరులగు సూరిజనులను దుష్టులు బాధించు సమయము లందు దుష్టులను శిక్షించుటకు వుపయోగపడునవిగా నుండవలయును. సర్వకాలములయందు కరుణామృత దృష్టితో లోకమును పరిపాలించవలయును యివి నిర్విషయ తమసాదులు.

కైవల్యశరీరమునందు నివసించి, అష్టవిధపద్ధతులుగా వ్యవహరించు పురుషుడు వుత్తమపురుషుడని నిర్ణయము. యెండమావులయందలి జలము పద్ధతిగా, అనగా క్షరాక్షర పురుషద్వయ దోషముల నంటకుండ వుండువాడు వుత్తమ పురుషుడు

జననమరణబాధ తొలగుటకు నిర్ణయించిన శక్తిద్వయ నిరాసకమువలన శుద్ధనిర్గుణమను కైవల్యశరీర నిర్ణయము. క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత పరమ తత్వమను వుత్తమపురుషుని నిర్ణయము, తెలిసి ప్రవర్తించినవారికి అవలీలగా జన్మరహితము కాగలదు యీపద్ధతి తెలియనివారికి అది కలలోనివార్తగా నుండును

కం॥ ఉన్నలేనేమొ యనకన్ వున్నది బయలనుచు ఏమొవుంటిని లేనం
చెన్న లేనట్టి నిన్నును పన్నగ గనిలేని నీవు పరుగిడవోయీ॥

అని నిర్ణయము.

## కైవల్యశరీరమునందు పురుషోత్తముని ఆచరణపద్ధతి

1. శక్తిద్వయ పద్ధతిమైల, అనగా అంటరానిది. శక్తిద్వయరహితము మడి. అనగా కైవల్యశరీర నిర్ణయము.

2. క్షరాక్షర నిర్ణయము జన్మాదులకు కారణముగా వున్నందున క్షరాక్షర ద్వయదోషరహిత నిర్ణయపద్ధతి అనగా పురుషోత్తమపద్ధతి నిర్ణయము నందు కర్తృత్వరహిత కర్మాచరణయే జరుపవలెను.

## 1. చైతన్య నిరసన పద్ధతి

దీపప్రకాశమునందు మానవుడొనర్చు కర్మలకు దీపము సాక్షిమాత్రమే కాని దీపమునకు ఆ కర్మఫలము లెట్లుచెందవో, సూర్యప్రకాశములో సకలజీవులు కర్మయొనర్చి ఫలములు పొందుచున్నను, సాక్షిగావున్న సూర్యుడెట్లు పొందడో, అట్లే సర్వసృష్టికి సాక్షిగాయున్న అధిష్ఠానచేతనబ్రహ్మము సాక్షిమాత్రమేకాని కర్మాదులను పొందబోదు. ఐనా శాశ్వతమగు, పరిపూర్ణ బ్రహ్మమునందు చేతన బ్రహ్మమునకు స్థానములేదుగనుక చేతన బ్రహ్మము అశాశ్వతమని సిద్ధాంతము. దీని అఖండ యెరుకయని చెప్పబడును.

## 2. అహంకార నిరసన పద్ధతి

అధిష్ఠానచేతన బ్రహ్మము జీవేశ్వర జగదోపాధి కలిగించవలయుననే అభిమానమున శ్రు॥ ఏకోహం బహుస్యాం అనే సంకల్పం కలిగి సృష్టించినది. గనుక అభిమానగుణము కలది. అభిమానము అహంకార గుణము కనుక అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు అహం వృత్తిగలదని సిద్ధాంతము. అధిష్ఠాన చేతన బ్రహ్మము తనవుపాధియందు సూక్ష్మరూపమున నిలచి వుండును.

1. హంసోహం, శివోహం. ఈశ్వరోహం, రుద్రోహం, విష్ణోహం, బ్రహ్మోహం, కూటస్థోహం, జీవోహం, బ్రాహ్మణోహం, క్షత్రియోహం, వైశ్యోహం, శూద్రోహం, ఛండాలోహం, స్త్రీయోహం, పురుషోహం, బద్ధోహం, ముక్తోహం, సత్యోహం, అసత్యోహం, సృష్టోహం. మరణోహం. యీ ప్రకారంగా సకల వ్యవహారములు అహంవృత్తివల్లనే జరుగుచున్నవి. అహంపదార్థరహిత మైనది అచలపరిపూర్ణము గనుక అహంకారము నిరసింపబడినది.

## 3. క్షేత్ర క్షేత్రజ్ఞరహిత పద్ధతి

అధిష్ఠానచేతన బ్రహ్మమే అయిన అఖండ యెరుకకు పృధివిపాదములు జలముకటి, అగ్నిహృదయము, వాయువుకంఠము, ఆకాశముశిరస్సు, యిది క్షేత్ర మనబడును. దీనిసూక్ష్మాంశమగు చేతన బ్రహ్మము అనగా కూటస్థుడు క్షేత్రజ్ఞుడు అనబడును ఈక్షేత్రజ్ఞుడు కాలనిర్ణయానుసారం వుత్పత్తి, స్థితి, లయ విస్తీర్ణ ఆకర్షణలుచేయు చుండును. పరిపూర్ణ పరబ్రహ్మమునకు క్షేత్రజ్ఞునికి సంబంధము లేదు కనుక క్షేత్ర క్షేత్రజ్ఞులు అశాశ్వతమని నిరసించబడినది.

## 4. ధర్మాధర్మ నిరసన పద్ధతి

ధర్మమనగా, సత్యాహింసలతో గూడిన న్యాయప్రవర్తన, యిందువల్ల దైవలోకప్రాప్తి కలుగును. అధర్మమనగా హింసాత్మకము అసత్యమార్గములతో గూడిన అన్యాయప్రవర్తన, యిందువల్ల నరకలోకప్రాప్తి కల్గును. కనుక స్థిత ప్రజ్ఞుని లక్షణమగు జననమరణ భ్రాంతిరహితమునకు నిర్ణయించిన పద్ధతిగా జ్ఞానేంద్రియముల ద్వారా విషయపంచకమును తెలుసుకొని కర్మేంద్రియముల ద్వారా ఆకర్మ ఆపద్ధతిగా నాచరించవలెను. అందువల్ల దైవలోక నరకలోక ప్రాప్తిలేక జనన మరణ రహితమగును. కాని ధర్మాధర్మరహిత పద్ధతియని తన యిష్టానుసారముగా ప్రవర్తించకూడదు. అట్లు ప్రవర్తించినవార్కి రౌరవాది నరక ప్రాప్తికలుగును. ధర్మాధర్మరహిత పద్ధతియనగా — మతవాదుల నిర్ణయాను సారము వ్రాసిపెట్టబడిన ధర్మశాస్త్రము లొకదాని కొకటి విరుద్ధముగ నుండును అట్టిధర్మము లాచరించక, తన జన్మరహిత పద్ధతికి యేది అనుకూలమో, అవి తన అంతఃకరణముచేత తాను నిర్ణయించుకొని ఆచరించవలయును. యీ పద్ధతి ధర్మముకాదు, అధర్మముకాదు. కైవల్యశరీర పురుషోత్తమపద్ధతి. కనుక ధర్మా ధర్మములు నిరసింపబడినవి.

## 5. కారణతను నిరసన పద్ధతి

అధిష్ఠానచేతన బ్రహ్మమగు అఖండయెరుక, సమస్తకర్మజ్ఞానములకు కారణముగానున్నది. యెట్లనగా. నేత్రమునందుండి సర్వరూపములు తెలుసుకొను

చున్నది. శ్రోత్రమువనుండి శబ్దమూ, చర్మమునుండి స్పర్శజిహ్వయందుండి రుచులను, నాసికమునుండి గంధములను తెలుసుకొనుచున్నది. మరణమునందు తనంతట తానే లేక పోవుచున్నది

జగచ్చక్షువగు ఆదిత్యస్థానమునయుండి, జలమును తన కిరణములచేత గ్రహించి మేఘములద్వారా వర్షింపజేసి కాలత్రయరూపమున సస్యాదులను పండించి, స్థావరజంగమ జీవోపాధులకు అన్నాదులొసగుచున్నది. ప్రళయమున తనంతటతానే లేకపోవుచున్నది.

మహాకాశమగు ప్రకాశరూప అఖండయెరుక ఆదిత్యునికి కారణంగావుండి లోకములను ప్రకాశింపజేసి, జంగమజీవోపాధుల నేత్రములనుండి కారణరూప ప్రకాశముగానున్నది. అచలపరిపూర్ణ పరబాహ్యమున చలనరహిత అచలపద్ధతిగా యుండునది కానందున జీవేశ్వర జగదోపాధికి కారణమగు యెరుకను అశాశ్వతి మని సిద్ధాంతము చేయడమైనది.

## 6. కారణకార్య నిరసన

కారణముగా నుండునది మహాకాశమగు అఖండయెరుక, దీనికార్యములగు విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్మలు. విశ్వతైజసప్రాజ్ఞ ప్రత్యగాత్మలు, స్థూలసూక్ష్మ, కారణ, మహాకారణములు, సర్వము నశ్వరములే. ఏల ననగా అచలపరిపూర్ణ పరబాహ్యమునకు, మహాకాశమునకు యెట్టి సంబంధము లేనందున మహాకాశమగు అఖండయెరుక అశాశ్వతముగావుంటే దానికార్యములు గూడా అశాశ్వతములే కారణముతోపాటు దానికార్యములున్నూ రహితమని సిద్ధాంతము.

## 7. మూలప్రకృతి నిరసన

పంచాకాశ అపరణమునందు తోచిన అహంస్ఫురణ, మూలప్రకృతియని త్రిగుణసామ్యమని చెప్పబడును. దీనియందలి సత్వగుణమువలన దేవత్వము రజో

గుణమువలన జీవత్వము, తమోగుణమువలన పంచమహాభూతములు యేర్పడినవి. యీ జీవేశ్వర జగదోపాధికి మహాకాశమనే ఆవరణము ఆవరించియున్నది. గురు కటాక్షముచేత ఆవరణమనే తెరయెత్తిచూస్తే అంతా అచలపరిపూర్ణ పరబ్రహ్మమే. అందు పంచాకాశములు, దానియందు తోచిన అహంస్ఫురణయగు మూల ప్రకృతి, దేవసృష్టి, జీవసృష్టి, భూతసృష్టి యెచ్చటాలేకుండా పోవును. కనుక మూలప్రకృతి నిరసింపబడినది.

## 8. అధిష్ఠానచేతన బ్రహ్మనిరసన

పంచాకాశ ఆవరణమునందు తోచిన అహంస్ఫురణ చేతనబ్రహ్మమని చెప్పబడును. ఈచేతన బ్రహ్మము మధ్యమపరిణామము మరియు యేకదేశీయము గాని పూర్ణత్వముగా యుండబోదు యెట్లనగా బీజమునందు మొలకకు కారణమగు అంకురము (సృష్టిచేతనము, లేక కదలిక) ఒక భాగమునందే వుండునుగాని బీజ మందంతటా వుండదు. అదేపద్ధతిగా పిండాండ శరీరములందు హృదయస్థానమున చేతన పద్ధతిగల ప్రత్యగాత్మయుండి శరీరమును కల్పించును ఆదిత్యుని ఆవరణము సూక్ష్మపంచాకాశములు. యీ ఆకాశములున్నూ మితిగల్గియున్నవేగాని అమితములు గావు. అందువల్ల అధిష్ఠానచేతనబ్రహ్మము మితముగానే వుండును. యిది అచల పరిపూర్ణమని నమ్మించి బ్రహ్మభ్రాంతిలో ముంచినారు అధిష్ఠానచేతనబ్రహ్మము పూర్ణముగా వుంటే దీనివలన సృష్టి, స్థితి లయ, విస్తీర్ణ ఆకర్షణలెట్లు జరుగును? జరుగుటకు వీలులేదు. నాలుగువైపులా సూదంటురాళ్ళపెడితో యేవిధంగా మధ్య నున్న యినుము కదలక అట్లే నిలచిపోవునో, అట్లే అధిష్ఠానచేతనము పూర్ణముగావుంటే కదలికతో గూడిన సృష్టి యెట్లుజరుగగలదు? కనుక అధిష్ఠాన చేతనమగు బ్రహ్మము యేకదేశీయమనియే చెప్పవలసివున్నది. కనుక పంచాకాశ ములు యెట్లురహితమో అట్లే వాని సూక్ష్మమగు అధిష్ఠానచేతన బ్రహ్మమున్నూ అచలపరిపూర్ణ బ్రహ్మమందు లేనిదేయగును. దీనికి పరిపూర్ణ పరబ్రహ్మమునకు యెట్టి సంబంధమూలేదు.

## 9. ప్రకృతి పురుషసంయోగ నిరసన

పంచాకాశ ఆవరణ మధ్యప్రదేశమునందు తెలియునట్టి అధిష్ఠాన చేతన బ్రహ్మము పంచావరణలయందు వుండునుగనుక చేతనబ్రహ్మమునకు పురుషు

పేరు దీని అవరణమునకు ప్రకృతియని పేరు. పంచాకాశ స్థూలములగు పంచ భూతములు కూడా యీ ప్రకృతిలోనివే. వీని సూక్ష్మరూపమగు ఆదిత్యవర్తియగు పరమాత్మకు పురుషుడని పేరు

అంతఃకరణ వర్తియగు ప్రత్యగాత్మ పురుషునికి ఆదిత్యవర్తియగు పరమాత్మ పురుషునికి అధిష్ఠాన చేతనమగు పురుషునికి యెట్లు సంబంధముండునో, పంచీకృత పంచభూతముల శరీరమునకు పంచభూతములకు పంచాకాశములకు అట్టి సంబంధముండును

అగ్నిని విడచి వుష్ణశక్తి (కాల్చుపద్ధతి) యెట్లు వేరుకాదో, అట్లే పురుషుని కన్న పురుషశక్తియగు ప్రకృతి వేరుగాదు పురుష ప్రకృతులు వేరుగాక యేకముగానే వుండును. యీ పురుష ప్రకృతులు సృష్టిస్థితి లయములు పొందుచున్ననూ అచలపరిపూర్ణ పరబయలుకెట్టి సంబంధములేదు కనుక పురుష ప్రకృతులు అశాశ్వతములని, - వీనిసంయోగము యెడతెగక యుండుననీ, యిందు పురుషుని విడచి ప్రకృతిగాని, ప్రకృతిని విడచి పురుషుడుగాని వుండబోరనీ, ప్రకృతిని రహితపరచి పురుషుడు బ్రహ్మైక్యము పొందునని చెప్పినవాక్యము లన్నియు అసత్యములని నిర్ణయించి ప్రకృతి పురుషసంయోగ నిరసన సిద్ధాంతీకరింపబడినది.

## 10 శివశక్త్యోపాధి నిరసన

పృధివికి అధిష్ఠానదేవత బ్రహ్మ; అతనిశక్తి క్రియాశక్తి. జలాధిష్ఠానదేవత విష్ణువు. అతనిశక్తి యిచ్ఛాశక్తి. అగ్ని అధిష్ఠానదేవత రుద్రుడు అతని శక్తి జ్ఞానశక్తి వాయువు యొక్క అధిష్ఠానదేవత యీశ్వరుడు అతనిశక్తి ఆదిశక్తి ఆకాశ అధిష్ఠానదేవత సదాశివుడు, అతనిశక్తి పరాశక్తి. ఈ సదాశివుడు పరాశక్తితో గూడుకొని సకలమును సృష్ట్యాదులొనర్చును కనుక విశ్వాభిమాని యీశ్వరుడని నిర్ణయము

అచట పరిపూర్ణ పరబ్రహ్మమునందు శివశక్త్యోపాధులకు స్థానములేదు కలయందు అగుపడిన యేనుగు మెలకువయందు కొంచమైన గానరాక యెట్లు పోవునో, అట్లు అచలపరిపూర్ణ పరబ్రహ్మమునందు విశ్వాభిమానియైన ఈశ్వరుడు అతని పరాశక్తి దానినుండియైన సర్వము లేకుండా పోవును. కనుక శివశక్తుల వలన కలిగేఫలములు అశాశ్వతములనీ నశ్వరములనీ శివశక్త్యోపాధి నిరసించనైనది

## 11. విద్యా విద్యోపాధి నిరసన

విద్యయనగా జ్ఞానము. వేదశాస్త్రములు. అవిద్యయనగా నజ్ఞానము. అహంకార అభిమానములు విద్యవలన కలుగునవి స్వర్గాదిమోక్షపదవులు. అవిద్య వలన, కామ్యకర్మాచరణ. యజ్ఞదాన తపఃక్రియలు వీనివలన కామ్యసిద్ధి స్వర్గ నరకాదిలోకములు సంభవించును సర్వమునకు యెరుకయే కారణము యెరుక నిర్మితమగు సర్వశాస్త్రములు కర్మరూపయోగ యోగాంగపద్ధతులు సర్వము శాశ్వత ఫలప్రాప్తినే కలిగించును. స్వప్నమునందు తాను నవఖండ మండలాధిపతియైనట్లు గజారోహణ గావించి వూరేగినట్లు గోదాన భూదానాది దానములు చేయుచున్నట్లు కలగనుచుండగా మెళకువ వచ్చినయెడల, తాను తనసైన్యము, ఆరోహించిన యేనుగు, సర్వము యెచ్చటికి పోయెనో తెలియనట్లుగా, అచలపరిపూర్ణ పరబ్రహ్మమున దానియందు మూలంలేక, దానినంటకయున్న మహాకాశమగు ప్రత్యక్షపూర్ణ మగు అఖండయెరుకను. తెలుసుకొన్నవారికి విద్యావిద్యోపాధి రహితము అని సిద్ధాంతం

## 12. సద సదోపాధి నిరసన

సత్పదార్థమనగా స్వయంప్రకాశమగు అధిష్ఠానచేతన బ్రహ్మము. అసత్ పదార్థమనగా, దాని స్థూలభాగమగు పంచభూతములు, పంచీకృత పంచభూతములు స్థావరజంగమ సృష్టివుపాధులు, అధిష్ఠానచేతన బ్రహ్మమును సత్ అనిన్నీద స్థూలమును అసత్ అనిన్నీ చెప్పుటకు కారణమేమనగా - బంగారమును, ; ఆకారముగ తయారుచేయగా బంగారముపై నగల ఆకారములు తెలి

ఆ నగలను కరిగించిన వాని ఆకారముపోయి బంగారము మాత్రమే తెలియు చుండును. బంగారం సత్ పదార్థము. దానిపైనున్న ఆకారములు మార్పుచెందు చుండును కనుక అసత్ పదార్థమన్నారు. అదేపద్ధతిగా మహాకాశమగు స్వప్రకాశ చేతన బ్రహ్మము బ్రహ్మముగా, పరమాత్మగా, ప్రత్యగాత్మగా, ప్రకాశవంతమై యుండును. దాని స్థూలభాగములు పంచభూతములుగానూ, సర్వశరీరములుగానూ మార్పుచెందుచుండును మార్పుచెందునది స్థూలరూపమే కనుక దానిని అసత్ పదార్థమన్నదేగాని దాని తొలిరూపము సద్రూపమే అయివున్నది. సూక్ష్మమగు చేతనమును సత్తని, దాని స్థూలమగు రూపములను అసత్ అనీ పేర్లు పెట్టినారు.

సదసత్తులు రెండూ అశాశ్వతములే కాని భ్రాంతిపరులు బ్రహ్మపదార్థ మును సత్తనీ శాశ్వతమనీ దానిస్థూల రూపములు అసత్ అనీ మాయయనీ. నిర్ణ యించుకొన్నారు. శరీరమునందువున్న రక్తము అసత్యమూ దానిసూక్ష్మమగు, పాలుసత్యమును అగునా ?

మానవోపాధియందు చక్రవర్తులుగాను నున్నవారు దైవాంశ సంభూ తులనీ, గొప్పవారనీ, యితర మానవులు తక్కువవారనీ, పరమాత్మ సృష్టిలో జంగమ జీవులుత్తమమనీ, స్థావరములు అధమమని నిర్ణయించుకొనుట వారి అభిమాన దృష్టియేగాని నిజముతెలిసి నిర్ణయించిన పద్ధతికాదు యెట్లనగా, మానవులకు ఆకలి, రోగము మొదలగు బాధలు గల్గినపుడు స్థావరములగు వృక్షలతాగుల్మాదులనుండి ఔషధములు, సస్యాదుల నుండి ఆహారము గ్రహించు చున్నారు. మరెన్ని అధమ జీవులని అంటూనే పశుపక్ష్యాదుల మాంసమును తిని ఆకలిబాధను నివారణ చేసుకొంటున్నారు. దైవాంశసంభూతులనే చక్రవర్తులు, సాధారణ మానవుల చేతనే రక్షింపబడి తమ పదవులను నిల్పుకొంటున్నారు. సుషుప్తియందు, అజ్ఞానమున మగ్నులై సర్వమానవులు (చక్రవర్తితో సహా) తామెవ్వరో తెలుసు కొనుటలేదు. హెచ్చుతగ్గులు అన్నియు అభిమాన దృష్టితోనే యేర్పడుచున్నవి అధిష్ఠాన బ్రహ్మము సత్ అనీ, దానిస్థూల భాగము అసత్ అనీ నిర్ణయము అభిమానుల పద్ధతేగాని నిజము తెలిసిన వారి పద్ధతికాదు. అభిమానుల నిర్ణయములు నిజపద్ధతియందు నిలువవు యెట్లనగా బంగారముపైన

తయారుచేసిన ఆకారములు దాని యందే లయమైనట్లుగానే అసద్రూప ప్రకృతి ఆకారములు అధిష్ఠానచేతన బ్రహ్మమునందు లయమగుచున్నవి. కనుక సత్ అన్నా, అసత్తన్నా రెండూ ఒకటే. వీనిని యెరుకమరుపులని చెప్పనగును. సదసదోపాధులు అశాశ్వత పద్ధతిగానున్నందున, అచల పరిపూర్ణ పరబాహ్యమునకు సంబంధములేనందున నశ్వరములని సిద్ధాంతము.

## 13. మాయా విద్యోపాధి నిరసన

మాయయనగా, తానుయెచ్చట నుండి వచ్చెనో, యెవ్వరూ తనను పొమ్మనే వారు లేకనే తనంటతానే లేకుండా పోవడమే మాయ అవిద్యయనగా జాగ్రదావస్థయందు తాను వున్నట్లు తెలియడము, సుషుప్తియందు తానులేకుండా పోవడం, అనగా తన్నుతాను తెలియక పోవడం అవిద్య, యీ రెండు పద్ధతులు అధిష్ఠానచేతన బ్రహ్మమగు యెరుక తనకుతానే నిర్ణయించుకొన్నది. అచల పరిపూర్ణపరబ్రహ్మమునందు యెరుకకు వునికి లేనందున మాయావిద్యోపాధి నిరసించడమైనది.

## 14. దేహీదేహోపాధి నిరసన

అన్నము సూక్ష్మాంశము మనస్సు, నీటి సూక్ష్మాంశము ప్రాణము, యీ రెంటి చేరికవలన కల్గునది ప్రత్మగాత్మ, అన్న సారము శుక్లము, నీటి సారము శోణితము, యీ రెంటిచేరికవల్ల కలిగినది శరీరము, ప్రత్యగాత్మకు దేహియనీ, శరీరమును దేహమనీ నిర్ణయము. యీ రెంటి చేరికను దేహీదేహో పాధియని చెప్పబడును. ఈ దేహీదేహో పాధులు బీజవృక్షన్యాయముగా ఒకటిని విడిచి ఒకటి ఉండవు. బీజము వృక్షమును వృక్షము బీజమును సృజించినట్లు ప్రాణ మనంబుల చేరికవల్ల కలుగుచున్న ప్రత్యగాత్మయగు ఎరుక శరీరము సృజించును శరీరము ప్రాణమనంబుల చేరికయగు ప్రత్యగాత్మయను ఎరుకను సృజించును. ఈ శరీరాత్మలకు అచల పరిపూర్ణ పరబాహ్యమునకు. ఏలాటి సంబంధములేదు. కనుకనే శరీరాత్మలు సృష్టిస్థితిలయములు పొందును. దీని పద్ధతి అచల పరిపూర్ణ పరబాహ్యము తెలుసుకోదు. ఒకప్పుడు బయలు యొక్క పద్ధతి అనగా చావుపుట్టకలు లేని పద్ధతి కలది బయలు అని, ఎరుక తెలుసుకున్న

ఎడల, దేహీదేహమును కాని, దేహముదేహిని కాని, ఉపాధి చేయకుండా లేక పోవును, కనుక దేహీదేహోపాధినిరసన చేయబడినది.

## 15. దృగ్దృశ్యోపాధి నిరసన

అధిష్ఠాన చేతన బ్రహ్మమగు అఖండ ఎరుక దృక్కు. జీవేశ్వరోపాధి యొక్క సృష్టిస్థితిలయ విస్తీర్ణ ఆకర్షణములు దృశ్యము పిండాండమునందు అంతఃకరణ అధిష్ఠానమగు ప్రత్యగాత్మ దృక్కు. అన్నమయాది కోశ పంచకము దృశ్యము అనగా అన్నమయకోశము యొక్క ధర్మము చావుపుట్టకలు, ప్రాణమయ కోశము యొక్క ఆకలి దప్పులు, మనోమయ కోశము యొక్క సంకల్ప వికల్పములు, విజ్ఞానమయ కోశము యొక్క ప్రజ్ఞావిశేషములు, ఆనందమయ కోశము యొక్క ఆనంద దుఃఖములు హిరణ్మయకోశమగు ప్రత్యగాత్మ యందలి విషయములు దృశ్యము అనదును.

అధిష్ఠాన చేతన బ్రహ్మమగు అఖండ ఎరుకకు, అంతఃకరణ అధిష్ఠాన చేతన బ్రహ్మమగు ప్రత్యగాత్మకు ప్రకాశవంతమగు ఎరుక కలయిక యున్నను చలనపద్ధతిగా ఉండునవిగాని అచల పరిపూర్ణపరబ్రహ్మము రీతిగా పూర్ణముగా చలించక ఉండునది కానందున దృక్ దృశ్యోపాధిని నిరసించడమైనది.

చలన పద్ధతిగల అధిష్ఠాన చేతన బ్రహ్మమునందు నిర్ణయించబడిన సాలోక్యాది పదవులు, జీవేశ్వర ఐక్యము, ప్రత్యగాత్మ పరమాత్మల ఐక్య రూపమగు మోక్షము, చెందినను అవి చలించిపోవునవేగాని అనగా జన్మాదులు కలుగునవియేగాని, జన్మరహిత పద్ధతి కలిగించునవి కావు

## 16. జ్ఞానాజ్ఞానోపాధి నిరసన

జ్ఞానమనగా మోక్షవిషయక బుద్ధి. అనగా తత్వమసి, అయ మాత్మ బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి: ప్రజ్ఞానం బ్రహ్మ, అను మహావాక్యార్థ జ్ఞానము. అజ్ఞాన మనగా కర్మఫల భ్రాంతి, అనగా జ్ఞానేంద్రియములచేత విషయపంచకము తెలుసు కొని కర్మేంద్రియములచేత కర్మలు ఆచరించి, ఆ కర్మఫలముల నాశించుట, అనగా తన సంతానము పెట్టినపిండ ప్రదానాదుల వలన మోక్షము

పొందుతానని తీర్థయాత్రల వలన సత్యన్నారాయణాది వ్రతాదుల వలన పుణ్య లోకములు పొందుతానని ఆశించుట అజ్ఞానము అనబడును.

ఈ జ్ఞానాజ్ఞానోపాధికి కారణమగు ఎరుక, మూలము లేక, అనాదిగా భ్రాంతి కారకమై యున్నది. కారణరూపమగు ఎరుకయే భ్రాంతి అయి ఉన్నందున దాని వలన ఉపాధిపొందిన జ్ఞానాజ్ఞానములు అశాశ్వతములు అయి ఉండక శాశ్వతములు అయి ఉండునా ? ఈ కర్మఫలముల నాశించిన వారికి ఏమిఫలముండునో, తమకు తామే నిశ్చయించుకొనవలయును. కనుక జ్ఞానా జ్ఞానోపాధి ఫలముల యందు భ్రాంతి లేక ప్రవర్తించుటకుగాను, వానిని నిరసించరమైనది.

## 17. విక్షేపావరణ నిరసన

పిండాండమందు అంతఃకరణము నిక్షేపము కలది. దీనికి ఆవరణము పంచకోశములు బ్రహ్మాండమునందు ఆదిత్యుడు విక్షేపపద్ధతి కలవాడు పంచ భూతములు వానికి ఆవరణముగా ఉన్నందున పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వము చలనరూపమే. ఇందు విక్షేపరూపమగు బ్రహ్మము శాశ్వతమని, ఆవరణము మాయ అని అశాశ్వతమని, నిర్ణయించుట భ్రాంతి ఆ బ్రహ్మ మందలి అభిమానమే ఇందుకు కారణము.

అచల పరిపూర్ణము శాశ్వతము విక్షేపావరణలు రెండు అశాశ్వ అని నిర్ణయించుకొని బ్రహ్మమందు మోక్ష భ్రాంతి లేక ఉండటమే విక్షేపా నిరసన.

## 18. ఆత్మానాత్మ నిరసన

ఆత్మ అనగా తెలివిగల జీవుడు. అనాత్మ అనగా తెలివి లేని పదార్థము. అని నిర్ణయించినారు. గాని పిపీలికాది బ్రహ్మపర్యంతము తె గలవే అయి ఉన్నవి అందుసామాన్య తెలివి విశేషతెలివి అని రెండు విధముల అధిష్ఠాన చేతన బ్రహ్మమగు అఖండ ఎరుక సామాన్య తెలివి కలది. అనగ ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ పద్ధతులు కలది. కనుక సామాన్యము

అని నిర్ణయము జీవుడు జ్ఞానేంద్రియములచేత విషయ పంచకమును తెలిసికొని కర్మలాచరించి వాని ఫలముల కాశించి అనేక పద్ధతులుగా ప్రవర్తించును గనుక జీవుని తెలివి విశేషమని చెప్పబడును. పంచకోశములకు తెలివిలేదు. కనుక అవి అనాత్మ అని ఇతరులు నిర్ణయించినారు. వారు భౌతికము గావించిరే గాని, వారికి వస్తునిర్ణయము ఉన్నట్లు చెప్పజాలము. ఏలననగా పృథివియందు పుట్టిన అన్నపానాదుల వలన అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, హిరణ్మయ కోశము పుట్టిపెరిగి నశించి పంచభూతములందు కలియుచున్నవి. పంచభూతములు ఆదిత్యుని వలన పుట్టి ప్రళయమునందు పంచాకాశములందు చేరుచున్నవి. తిరిగి మహాకాశమగు అదిష్టాన చేతన బ్రహ్మము వలన సర్వము సృష్టించబడుచున్నవి.

పిండాండమునందు ఆకలి, దప్పి, రోగాదుల వలన జీవుని అన్నమయ కోశశరీరము బలహీనమై బాధచెందుచున్నది. అన్నపానాదుల వలనను ఔషధ సేవవలనను మరల ఆరోగ్యముచెంది సంతోషముగా ఉండును. అన్నపాన ఔషధముల యందు ఉన్న సామాన్యాత్మ తనయందలి విశేషాత్మతో కలిసి బాధనివృత్తిచేయుచున్నది. ఈ సామాన్యాత్మ పద్ధతి తెలిసికోలేక, శ్రు॥ ఏకో దేవస్సర్వభూతేషుగూఢః సర్వభూతాంతరాత్మ అనే నిర్ణయము లేక, అనాత్మలు, జడములు అని నిర్ణయించినారు తెలివిలేనట్టుగా కానవచ్చుచున్నను పంచభూతాది స్థావరములు సర్వము సామాన్యపద్ధతిగల అదిషాన చేతన బ్రహ్మమను అఖండ ఎరుకచే వ్యాపింపబడి యున్నందున వానిని జడములు అనరాదు. అచల పరిపూర్ణపరబ్రహ్మమునకు, అఖండ ఎరుకకు సంబంధము లేనందున ఆత్మానాత్మ నిరసనగావింప బడినది.

## 19 బ్రహ్మ ఆత్మోపాధి నిరసన

అధిషానచేతన బ్రహ్మమను అఖండయెరుక వుపాధియందాత్మయని చెప్పబడును. ఆత్మ, ప్రథమమున సృష్టియందు ప్రాణమును సృష్టించి, దానివలన పంచభూతములు, పపంచీకృత ంచభూతములు, సృష్టించి వానియంందు తాను మనోరూపమున నివసించి సృష్టిస్థితిలయములు పొందుచుండును. కనుక సకలోపాధుల యందూ నుండునట్టి ఆత్మ, దానికారణమగు బ్రహ్మమూ నిరసన చేయబడినవి.

## 20. జీవేశ్వరోపాధి నిరసన

దేహాభిమానియగు జీవుడు, విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్మగాత్మ పద్ధతులుగా మార్పుచెందును. విశ్వాభిమానియగు యీశ్వరుడు, విరాట్టు, హిరణ్యగర్భుడు, అవ్యాకృతుడు, పరమాత్ములుగా మార్పుచెందును. బ్రహ్మాండాభిమానిగాయున్న బ్రహ్మము జీవేశ్వర జగత్తులను సృష్టిస్థితి లయములు గావించును. కనుక జీవేశ్వరులపైన శాశ్వతభ్రాంతి నుంచడము అనర్ధకమని నిరసించడమైనది.

## 21. క్షరాక్షరోపాధి నిరసన

స్థావరజంగమ జీవోపాధులు క్షరములు. అధిష్ఠానచేతన బ్రహ్మమను అఖండయెరుక అక్షరము. ఆకాశము యొక్క సూక్ష్మభాగమగు ప్రకాశరూపమగు బ్రహ్మము, వాయువు యొక్క సూక్ష్మభాగమగు ప్రాణము, యీ రెండూ, (అనగా ఆత్మబ్రహ్మ ప్రకాశమూ, ఆత్మరూప ప్రాణమూ) యీ రెంటి చేరిక అఖండ యెరుక అక్షరుడు.

అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు, నీటియొక్క సూక్ష్మాంశము ప్రాణమూ, యీ రెండిటివలన తెలియబడు, జీవుడు (లేక ప్రత్యగాత్మ) క్షరపురుషుడు అని నిర్ణయము.

ఈ క్షరాక్షర పురుషులు, వస్తుసముదాయముచేత నిర్ణయింపబడిన వారేగాని, ప్రత్యేక పదార్థరూపులుగారు. కలయికవలన యేర్పడినవారు. పదార్థములు విడిపోయినయెడల వృథయులు లేకుండాపోవువారే. కనుక క్షరాక్షరములు శాశ్వతమని మోక్షభ్రాంతికలిగి వుండడము, అనర్ధకమని నిరసించడమైనది.

## 22. పరాప్రకృతి నిరసన

అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతములు, జ్ఞానకర్మేంద్రియములు, మనస్సు అనునవి చేతన బ్రహ్మమునకు వేరని, పరాప్రకృతియని నిర్ణయించి. యీప్రకృతికి బ్రహ్మమువేరని, అట్లు

వేరుగావుండి సృష్టిజరుపుచున్నదని, అదే సృష్టికారణమని యితరులు నిర్ణయించినారు. అట్లు అనుట సరిగాదు. వస్తునిశ్చయముగా వున్నది వున్నట్లు విచారించి చూడగా, బ్రహ్మము సూక్ష్మము దానిస్థూలము పరాప్రకృతి, యీరెండూ యేకైకద్వంద్వరూపంగాని ఒకదాని కొకటి భిన్నముకావు. పరాప్రకృతి లేనిచో, బ్రహ్మముకూడా లేకపోవును. కనుక రెండూ అశాశ్వతములేనని నిరసించదమైనది.

## 23. మహావాక్య స్వప్రకాశ నిరసన

1. ప్రజ్ఞానంబ్రహ్మ, 2. అహంబ్రహ్మాస్మి, 3. తత్వమసి, 4 అయమాత్మా బ్రహ్మయను చతుర్విధ మహావాక్యములను, లక్షణత్రయముచేత, ముఖ్యంగా భాగత్యాగ లక్షణముచేత విచారించి తెలుసుకొన్న స్వప్రకాశ బ్రహ్మము ఖండాఖండ రూపముగానున్నది. దాని నభిమానించినవారు అది ఖండరూపము గాదని, అఖండంగా వున్నదని చెప్పెదరు. దానికి పూర్ణబ్రహ్మమునకు యెట్టి సంబంధమూ లేనందున నిరసించదమైనది.

## 24. అమృతసార నిరసన

అమృతరూపమగు పరిపూర పరబాహ్యమువలన వేదములు, వేదశిఖలగు యుపనిషత్తులు పుట్టలేదు. కాని, వానిసారమే అమృతము; అట్టి సారమును గ్రహించి యెరుకను మ్రింగి పరిపూర్ణులము కాగలమని; కొందరు భ్రమించుచున్నారు. ఈ పద్ధతి జన్మహేతువేగాని, జన్మరహిత పద్ధతిగాదు; వేదములను, వుపనిషత్తులను, మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేచేసి తన ప్రభావమునే నిర్ణయించినదిగాని తనలేమిని తెలియనీయలేదు. కనుక అది మృతరూపమేగాని అమృతరూపంగాదు. పరిపూర్ణ పరబాహ్యము మృతమును మ్రింగునట్టి అమృతము గాదు. ఏలననగా పరిపూర్ణము ఏవస్తువులోనూ ప్రవేశించదు. ఏవస్తువునూ తనలో చేర్చుకొనదు. కనుక అమృతరూపమైన పరిపూర్ణము, అధిష్ఠానచేతనమగు .యెరుకగాదు. యెరుక పరిపూర్ణ పరబయిలుకాదని అమృతసార నిరసన చేయబడినది

కం. పరిపూర్ణ మెరుకలెట్టివో । గురుముఖమున । రెంట్ని
లెన్నగురుతెరిగెరుకన్ । సరిపుచ్చుకొన్న మృషయని ।
పరిశుద్ధపుబోధ యీది । పాటించి కనరా ।
శివరాముల పద్ధతియిదెరా । నరులు కొందరు
బల్కిరెరుకాను భ్రమింగి । యీ పరిపూర్ణమయ్యే
మంచెరుగాక చెడుటాకై పాటించికనరా ।
శివరాముల పద్ధతియిదెరా॥

కం॥ అలభద్రాచల మనిన బయలుగా గుర్తెరుగవలయు ।
యెరుకను విష్ణ్వం । దులదోచి గురుని కృపచే ।
నిలువక విష్ణ్వేగిరి పోతె । నిశ్చాయమదెరా ।
కృష్ణదాసు । నిశ్చాయమిదెరా । యిలమీద
యెవరైన యీకందార్థముల । లోపలి గూడార్థ
ము దెలియ భ్రమనుజెందరువారు । నిశ్చాయ
మదెరా । కృష్ణదాసు నిశ్చాయమిదెరా॥

కం॥ విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని
మర్మము దెలసున్ । వినజెప్ప నేరకుండిన ।
మనుజులు యీబోధలోని । మర్మామెరిగేరా ।
దీనందుండే । ధర్మామెరిగేరా । జనులె కొబ్బరి
కాయ తిననేర్పుగలవారు । తిననేర్చునా
కోతి । తనకా కాయబిచ్చిన । మర్మామెరిగేరా ।
దీనందుండె । ధర్మమెరిగేరా॥

కం॥ ఏబోధ శిష్యులకుగల
యాబాధల నణచివేయు నదెసద్బోధా ।
ఆబోధ యేదియనినను
యీబోధేసుమ్మి దీన్నియిక విడువకుమీ॥

---

## 25. గురుశిష్య నిరసన

పూర్ణగురు సార్వభౌముడు, తన గురువువద్ద, విశ్వతైజస, ప్రాజ్ఞప్రత్య గాత్మలను జీవతను చతుష్టయమును, విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత పర మాత్మలనే యీశ్వరతను చతుష్టయమును తెలసి యీఅష్టతనువులకు ఆవరణముగా నున్న మహాకాశమను అఖండ యెరుకనూ తెలిసి, వీనికి సంబంధము లేకుండా, అంతటను నిండియున్న పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుసుకొని, క్షరాక్షరోపాధికి అతీతమగు కైవల్యశరీర పురుషోత్తమ పద్ధతిగావున్న గురుమూర్తి కడకు శిష్యుడే దేతెంచి, అశరీరమార్గమును తెలియజేయుమని ప్రార్థించగా, అందుకంగీకరించి, కరుణామృత దృష్టితోవీక్షించి, హస్తమస్తక సంయోగముచేసి, తన పురుషోత్తమ స్థానమునుండిదిగి జీవతను, యీశ్వరతను, చతుష్టయములను బోధించి, మహా కాశమగు అఖండ యెరుకయందు గురుశిష్యుల యేకత్వనిర్ణయముచూపి, పరిపూర్ణ పరబ్రహ్మమునందు అఖండ యెరుకతోపాటు గురుశిష్యులు లేకుండా పోవుదురు గనుక గురుశిష్య నిరసన చేయడమైనది.

పూర్ణగురువు తన గురుమూర్తివద్ద జననమరణ భ్రాంతిరహితము కొరకు పరిపూర్ణ బోధవిని, పరిపూర్ణస్థితి పురుషలక్షణముగ కైవల్యశరీర వుత్తమ పురుష లక్షణముగ యెట్టిభ్రాంతులు లేకుండ నుండగా, శిష్యుడేతెంచి జన్మరహిత ప్రబోధ కోరగా గురుమూర్తి అంగీకరించినందున, యీ అంగీకారావరణము గురుని అంతః కరణమున నూతనముగా కల్గెను. ఈ ఆవరణము శిష్యుడు కూడ భ్రాంతిరహితుడైన గాని తొలగదు. శిష్యునిభ్రాంతిరహితుని చేయుటే గురునిధర్మము. గురువు శిష్యుని ధనకనకవస్తువాహనాదుల నపేక్షించినచో ఆ భ్రాంతిచేత గురువు నరకము పొందును. అని సాంప్రదాయక పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతము.

ఇతి శ్రీ అచలఋషి దయానంద పొన్నాల రాజయోగి విరచిత సాం దాయక పరిపూర్ణ ప్రబోధిని రాజయోగీయం సంపూర్ణం. సర్వం సద్గురు విందార్పణమస్తు.

శ్రీ నిజగురు మహారాజకీ జై జై జై.